Own a house or apa ...

Flats are available

# Seashells

## Atop Krupa Hills

## VISAKHAPATNAM

### And get the best of both worlds

Visakhapatnam- City of Destiny, is one of the fastest growing cities in India today With its Natural Port and increasing Industrial, Business and Trade Activities, it offers unlimited opportunities

**Seashells**

Atop Krupa Hills

Green hills, golden beaches, cool sea breeze, swaying palms Believe it or not, we are not describing a holiday resort but an exclusive residential paradise called Seashells, located atop picturesque hills

**YES! At SEASHELLS** it will be an investment in Peace & Prosperity

**Seashells offers you these exceptional facilities:**

- ★ Adequate guest car park
- ☆ Service shops
- ★ Meditation Hall
- ★ Maintenance Workshop
- ★ Club House
- ☆ Swimming pool
- ★ Children's Play Corner
- ★ Tennis Court
- ★ Jogging Track
- ★ Landscaped green common plot with sitouts and walk arounds
- ☆ Dish Antenna
- ☆ Fire safety and fire fighting facilities
- ★ Adequate water supply Tubewell and Municipal Water
- ★ Gymnasium
- ★ Creche
- ★ Standby Generators for lift and other essential services



**2, 3 & 4 BED ROOM APARTMENTS & ROW HOUSES**

For more Information

**Ugesh & Madhav Builders (P) Ltd.**
1-2-1, Waltair Uplands, Visakhapatnam 530003
Phone 662.. Cable KRUPA
Managing Director **P.V. Ramaniah Raja**

Madras
**RAJA RAMANIAH & CO**
1-C Century Plaza, 560, Anna Salai P.B No 1488, Madras-600018
Phone 45710.., 454667, Telex .. 6098 RPCO IN
Fax (91) 44-4.6354 Cable KRUPA

Architects:
**Design Planning Services (P) Ltd**
Ahmedabad-380009

**FINANCE AVAILABLE FROM VYSYA BANK, CANFIN HOMES, LIC, A.B.Homes & H.D.F.C**

JAGATI        Rs. 2-00        March 1992

37th Year of Publication




428

మార్చి - 1992

## సాహితీ సుధ

నిగమ సుభాషిరాభ్యసన నిష్ఠలు గల్గిన యట్టి పండితుల్
మగువల పొందు నింద్యమని మాటికి వార్తలు చెప్పనేర్పరుల్
జగమున నెవ్వడోపు విలసత్కుచు విందు మణి ప్రభా ధగ
ధగ్గిత కలాప రమ్య వనితా జఘనంబు బరిత్యజింపగాన్

—భర్తృహరి



హరిహయ వాహన హంకారము హరించి - వేడి వేలుపు జాడ వెంటనంటి
తపన జాయన దండ తాండవం బెడలించి - దనుజ ఘోరాకార దర్ప మడచి
కడలిజేని బిడార మడుగు మాట్ట గలంచి - గాలి రజోవ్యాప్తి గాకు సేసి
ధనరాజ నిధి ముద్ర దన వశం బొనరించి - యిభ దైత్యహరుని పట్టెల్ల జెలిచి
యవని గబళించి నభమెల్ల నాక్రమించి - కమల జాబడ కటాహంబు గడవ బెలిగి
జాలిదిత్య సంధ్యాభిచార హోమ - వీతిహోత్ర భవభీల వృత్రమూర్తి

—చీకటి వర్ణన - భట్టుమూర్తి 'వసు చరిత్ర'





'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : గోర్బచెవ్

# నిమ్మతొనాలు

హలో హలో - నేను గోవిందుని ....హైదరాబాదు నుంచి మాట్లాడుతున్నాను.

'ఆ.... బాగున్నావా? బాగా చదువుతున్నావా?' - అని అవతల కొసనుంచి తండ్రి.

'నిన్న బస్సులో పర్సు పోయింది ....అయిదువందలు అర్జంటుగా....'

రెండు మూడు నెలలకొకసారి పర్సు పోగట్టుకొనే సుపుత్రుని అభ్యర్థనకు తండ్రి, 'ఏమిటీ?' అని ప్రశ్నించాడు.

'నిన్న బస్సులో పర్సు పోయింది ....అయిదువందలు అర్జంటుగా....'

'ఏమిటీ?.... లైను సరిగా వినపడటం లేదు....'

'అయిదు వందలు.... అర్జంట్'....

'నువ్వేమి చెబుతున్నావో యిక్కడ వినబడటం లేదు' - అన్నాడు తండ్రి.

మధ్యలో ఆపరేటర్ కల్పించుకొని, 'సార్, వినిపిస్తోంది కదుటండీ - వినపడటం లేదంటా రేమిటి?' - అన్నాడు.

'అయితే, నువ్వు పంపవయ్యా ఆ అయిదొందలు' - అని ఠక్కున రిసీవర్ పెటేశాడు గోవింద తండ్రి.

—కె వెంకటరావు
పామర్రు

బార్‌లో పాత మిత్రులు కలుసుకున్నారు. ఒకరు ప్రేమదాసు, మరొకరు దేవదాసు. ఇరువురూ చేతుల్లో గ్లాసులు పుచ్చుకు ఇంద్రలోక విహారం చేస్తున్నారు.

'ప్రియ మిత్రమా, నీకు ఈ మందు కొట్టే అలవాటు ఎప్పుడు అలవడింది? నా విషయమంటే లోకానికి తెలుసు - పార్వతిని పొందలేక పోయాను. అందుకని ఈ మధుపాత్ర శరణుజొచ్చాను' - అన్నాడు దేవదాసు కవిత్వం వొలకబోస్తూ.

'నేస్తమా, ఈ లోకం విచిత్రమైనది. నీవు పోగొట్టుకున్న దానికై పరితపిస్తున్నావు. నేను పొందిన దానికై పరితపిస్తున్నాను - ప్రేమించి పెళ్లి చేసుకున్నాను,' - అన్నాడు ప్రేమదాసు.

—ఆర్ శ్యామలరావు
రాజమండ్రి-2

ఆ ఊరుకి ట్రాన్స్‌ఫరై వచ్చినప్పట్నుంచీ తనవంక ముసి ముసి నవ్వులతో చూసే ముకుందాన్ని గమనించకపోలేదు స్టెనో శాంతకుమారి. అయిదారు వారాలయే సరికి అవి అర్థవంతమగు చూపులని గ్రహించిన శాంతకుమారి, 'ఇవ్వాళ సాయింత్రం

రెస్టారెంట్‌కి వెళ్దామాండీ ?' అని అడిగింది ముకుందాన్ని.

అతను సంతోషం పట్టలేక వుక్కిరి బిక్కిరై 'మీకు నాపై దయ కలగడం నా అదృష్టం' అన్నాడు.

'మీకు నన్ను పల్కరించాలని వుంది. కాని, మొహమాట పడుతున్నారు' అంది శాంతకుమారి.

'నేను పిరికివాణ్ణండి'

'మీ పిరికితనం పోగొడ్తానుగా!'

ఫామిలీ రూమ్‌లో కూచుని సిమితంగా టిఫినూ కాఫీ పూర్తయి, అయిస్‌క్రీమ్ దగ్గిర కొచ్చినప్పుడు, 'నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానండీ' - అన్నాడు ముకుందం.

'నాకు తెలుసు'

'మిమ్మల్ని పెళ్లి చేసుకోవాలని వుందండి.'

'అది కుదరదు'

'ఎంచేత ?'

'మా ఆయన వొప్పుకోరు.'

—ఎమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

మీ ఇంటి పేరు ?'

'కులపతి'

'మీ తండ్రి పేరు ?'

'చలపతి'

'మీ ఊరి పేరు ?'

'తిరుపతి'

'మీ అబ్బాయి పేరు ?'

'సీతాపతి'

'మీ అల్లుడి పేరు ?'

'లక్ష్మీపతి'

వరసని యిలా చెప్పుకొస్తున్న తోటి ప్రయాణీకునిపై ఆసక్తి పెరిగి, ముత్తాత పేరేమిటి ? అని అడిగాడు వైకుంఠం.

'విశ్వపతి'

'ఇంతకీ మీ పేరేమిటి ?'

'పరపతి'

—పి కుసుమకుమారి
హైదరాబాదు-45









# పాఠకుల తీర్పు

శ్రీ చందూర్ గారికి నమస్కారం. నవంబరు 'జగతి' ఇంకా రాలేదేమా అనిపించేటంత ఆలస్యంగా రావడం కొంత నిరుత్సాహం అయితే, రాగానే చదివే నిమ్మతొనలు, మీ డైరీ, ఉత్తరాలు మొ॥ శీర్షికలు లేకపోవడం, మరింత నిరుత్సాహం కలిగించింది. బహుశా సినిమా కథల వల్ల కావచ్చును. 'ఎంత సినిమా అయినా, ఇష్టమైన శీర్షికల్ని మింగేస్తే ఎలా ?' - అనిపించింది.

—రావి కొండలరావు
మద్రాసు-18

సంపాదకులకు నమస్కారం. దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడిన 'జగతి' లో ఇంటర్నేషనల్ ఫిలిమ్ ఫెస్టివల్ విశేషాలు మమ్మల్ని అద్భుతంగా ఆకట్టుకున్నాయి. జవహర్‌లాల్ ముఖ చిత్రం నిండు తన మిచ్చింది.

—సి నాగేశ్వరరావు
సికిందరబాదు-3

చందూర్ గార్కి నమస్సుమాంజలి. కుశల ప్రశ్నలయాక, రెండు నిమ్మతొనలు నోట్లో వేసుకు, పాఠకుల తీర్పు ఉత్సాహంగా విని, వెన్నెల కెరటాలలోకి దూకి, చిత్ర జగతి విచిత్రం చూసి, మానవ ప్రగతి తెలుసుకు, 'నా రాట్నచక్రం' లో ఒకసారి అద్దం చూసుకు, రసానుభూతితో ఉప్పొంగి, గోదావరి నదీ ప్రవాహంలో ఈదులాడి, చిన్ననాటి తీపి గుర్తులతో గుండెను నింపుకు, కొత్త పుస్తకాల్లో పడ్డాను. యన్నార్ గారి 'డైరీ'లో ప్రత్యేకత ఉంది - ఎంత ఓపిగ్గా ఏరుకొస్తారో ముత్యాలూ రత్నాలూ.

—త్రిపుర
శ్రీరామ్‌నగర్

శ్రీ ఎన్ ఆర్ చందూర్ గార్కి సంక్రాంతి శుభాకాంక్షలతో.... ప్రతి సంచిక బాగుంటోంది. పేరుకి తగట్టు చాలా విషయాలు సరళమైన శైలిలో, పాఠకుల మనసుకి హత్తుకొనేలా, క్రమం తప్పకుండా చెప్పడం సులభం కాదు. అట్టిది మీరు 37 సంవత్సరాలుగా చేస్తున్నారంటే, అది సామాన్యం కాదు ; సారస్వత సేవ, సామాజిక స్పృహ ఈ రెంటినీ సరియైన పాళ్లలో అందిస్తున్న 'జగతి' చిరకాలం వర్ధిల్లాలని ఆశిస్తున్నాను. ఆంధ్రప్రదేశ్‌లోని తెలుగు వారందరికీ 'జగతి' అందుబాట్లో ఉంటే బాగుండును.

—ఎవి కృష్ణారావు
ఐఐటి, మద్రాసు-36

# వెన్నెల కెరటాలు

## మహాదేవీవర్మ

పగలంతా పనిచేసినా అలసిపోని, రాత్రి చీకట్లు ముసిరినా నిరాశ జెందని ఉదాత్త సమరస వ్యక్తిత్వం మహాదేవి సొత్తు. వీరి కావ్యం 'యామా' లో 'నీహార్' (మంచు) 'రశ్మి' 'నీరజా' (కమలం), 'సాంధ్యగీత్' (సాంధ్య గీతాలు) కలిసి మెలిసి కనిపిస్తాయి. ఇవన్నీ కలిస్తేనే సమగ్ర జీవితం సాధ్యమని కవయిత్రి అభిప్రాయం. జీవితంలో అడుగు పెడుతూనే సమస్యల మంచు వర్షాల నెదుర్కొన వలసినప్పటికీ ఆత్మవిశ్వాసం కోల్పోకుండా ముందడుగు వేస్తూ, తన కన్నీటి నుండే సరికొత్త విద్యుత్తు నుత్పత్తి చేసి, లోకం నిండా వెలుగు పూలను వెదజల్లి, అనితర సాధ్యంగా నిలిచిన దేవి మహాదేవి.... బాహ్య జగత్తులోని వైవిధ్యాన్నంతా తన అంతర్జగత్తులో సమన్వయం చేసుకొని లోకం కోసమే నిరంతరం వర్షిస్తున్న మేఘమాలిక మహాదేవికి గౌతమ బుద్ధుడంటే ఎంతో యిష్టం.

—ఎ శ్రీరామరెడ్డి
'స్రవంతి'లో

## జ్ఞాపకాల వెలుగు

సరిగా 30 సంవత్సారాల క్రిందట విశాఖ రచయితల సంఘం అధ్వర్యాన 1961 సెప్టెంబరు 30, అక్టోబరు 1 తేదీలలో విశాఖపట్నం టౌన్‌హాల్లో "రచయితల మహాసభలు" జరిగేయి. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఎ. ఎల్. నారాయణగారు సభాధ్యక్షులు యూనివర్సిటీ రిజిష్ట్రార్ కె. వి. గోపాలస్వామిగారు ఉపన్యసించారు. ఆంధ్రప్రభ - సంపాదకులు నీలంరాజు వేంకట శేషయ్యగారు ప్రారంభోపన్యాసం చేశారు. ఉత్తరాంధ్ర జిల్లాల వివిధ ప్రదేశాల నుండి 50 మంది రచయితలు (కవులు) సభలకు వచ్చేరు. పలువురు సాహితీ ప్రముఖులు, రచయితలు, పౌరులు సభలకు హాజరయ్యారు. ఆ రెండు రోజుల రచయితల సమావేశాలలో అనేక తీర్మానాలు చేయబడ్డాయి. వానిలో ముఖ్యమైన కొన్నింటిలో ఒక పత్రిక ప్రారంభించడం, గ్రంథ ప్రచురణ సంస్థ ఏర్పాటు చేయటమూ ఉన్నాయి. 1962 జూన్‌లో "రచన" అనే మాసపత్రిక "ఉత్తరాంధ్ర గ్రంథమాల" ఏర్పడినవి.

—మసూనా
'తూర్పు సీమ'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్

## గౌ రీ వా రి
## 'గోపాలుడు భూపాలుడు'

అనగా అనగా ఒక రాజు. ఆ రాజుగారి భార్యకు కవల పిల్లలు కలుగుతారు. సరిగ్గా ఆ సంతోష సమయాన రాజుగారి తమ్ముడు, సింహాసన ప్రాప్తి తనకిక లేదని, అన్నగారిని చాటుగా పొడుస్తాడు. ఏకోదరుని దుర్బుద్ధికి, దురంతానికి ఆగ్రహోద్యాత్త చిత్తుడైన రాజు, తమ్మునితో కత్తియుద్ధానికి దిగుతాడు. అన్నదమ్ములిద్దరూ ఏకకాలమందు నేలకొరగడం చూసిన పచ్చి బాలింతరాలు, తమ వంశానికి ఏదో శాపం వుండి వుంటుందని, కవలపిల్లలలో ఒకరిని, నమ్మకస్తురాలైన దాసీ మ ని షి కి చ్చి, అడవులలోకి పంపివేస్తుంది - ఆ విధంగా కవలల్ని విడదీస్తే కీడు తగుతుందని!.... అటవీ గ్రామంలో గోపాలునిగా ఒకరు పెరుగుతూంటే, రాజప్రాసాదంలో భూపాలునిగా మరొకరు. ఈ భూపాలునికి తన కూతుర్నిచ్చి పెళ్లి చేసి, రాజ్యభారం బుజాల మీద నుంచి దించుకుందా మనుకుంటాడు మేనమామ. అయితే, అల్లుడు అంత సులువుగా లభ్యంకాడు. మారు వేషం (సిపాయి) వేసుకుతిరిగే భూపాలుడు ఒక పల్లె పిల్లను ప్రేమిస్తాడు. మరి, మేనమామ కూతురు ఏం గావాలి? అడవుల్లో పెరిగిన గోపాలుని సాహసానికి ఆమె ముగ్ధురాలై అతనిని ప్రేమిస్తుంది. రాకుమారుడు పేద కన్యను ప్రేమించడం, సామాన్యుడు రాజకుమారిని ప్రేమించడం, వారి ప్రేమలు సఫలం కావడం - యివి చాలుకదా సగటు ప్రేక్షకునికి .... అద్భుత లోకంలో విహరిస్తూ, తెరమీద సాహసాలకు సంబరపడే స్థితిలో ప్రేక్షకాభిరుచి వున్నంత కాలం, ఈ మాదిరి చిత్రాలు ఉత్పత్తి అవుతూనే ఉంటాయి. గోపాల, భూపాల పాత్రలు రెండూ యన్‌టి రామారావు ధరించడం (ద్విపాత్రాభినయం) ఈ చిత్రంలోని ప్రత్యేకాకర్షణ. దుష్టభూమిక రాజనాలది. పాతాళ గృహం, జలప్రమాదం మొసలితో పోరాటం, నీటిమీద పెట్రోలు పోసి అంటించడం (ఈ జానపదగాథలో పెట్రోలేమిటని అడిగే అధికారం మనకు లేదు), అనేక సాహస కృత్యాలు జరిగాక, అన్నదమ్ములిద్దరూ కావిలించుకు శుభం పలుకుతారు.... నిర్మాత: యస్. భావనారాయణ.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జ గ తి' - మార్చి, 1967

## మానవ ప్రగతి

3

### రామానుజన్

సుమారు 70 ఏళ్ల క్రితం మృతి చెందిన ప్రసిద్ధ భారతీయ గణిత మేధావి శ్రీనివాస రామానుజన్ జీవిత చరిత్ర ఇటీవల అమెరికాలో ప్రచురితమై అక్కడ ఒక ప్రధాన చర్చనీయాంశమైంది. 'ది మాన్ హు న్యూ ఇన్‌ఫినిటీ' 'అనంతం తెలిసిన మనిషి' అనే పేరుతో వెలువడిన ఈ జీవిత చరిత్ర రచన వల్ల తనకు రామానుజన్ జీవితం గురించి తెలియడమే కాక దాని ప్రభావంతో తన జీవితం కూడా గొప్పగా సుసంపన్నమైనదని రచయిత రాబర్ట్ కానిబెల్ అన్నారు. తన 25 ఏళ్ల వయసులో మద్రాసులో గుమాస్తాగా పని చేస్తున్నప్పుడు రామానుజన్ తనను గురించి తాను పరిచయం చేసుకుంటూ ప్రముఖ బ్రిటిష్ గణితమేధావి జి.హెచ్. హార్డీకి ఒక లేఖ వ్రాశారు. సుదీర్ఘమైన ఆ లేఖలో ఆయన తాను రూపొందించిన పెక్కు గణిత సూత్రాలను కూడా పొందుపరిచారు. పాశ్చాత్య ప్రపంచ విజ్ఞాన కేంద్రం లాంటి కేంబ్రిడ్జికి అనేక వేల మైళ్ల దూరంలో వుండి, కేవలం హైస్కూలు విద్యను మాత్రమే పూర్తి చేసిన శ్రీనివాస రామానుజన్ గణితంలో కనబరిచిన విశేషమైన ప్రతిభను హార్డీ ఆ ఉత్తరం ద్వారా గమనించి ముగ్ధుడయ్యారు. వెంటనే రామానుజన్‌ని తనతో కలసి పనిచేసేందుకు కేంబ్రిడ్జికి ఆహ్వానించారు. ఈ ఆహ్వానం రామానుజన్‌కు ఎంతగానో ఆనందం కలిగించింది. అంతకు పూర్వం ఆయన, సహాయం కోసం అనేక మంది గణిత పండితులకు ఉత్తరాలు వ్రాసిన వారిలో ఎవరూ రామానుజన్ పట్ల ఆసక్తి చూపలేదు. రామానుజన్ సుమారు ఆరేళ్లపాటు కేంబ్రిడ్జిలో హార్డీతో కలసి పనిచేశారు. విభిన్న పూర్వపరాలు, విభిన్న వ్యక్తిత్వాలు కలిగిన వారైనప్పటికి ఆ ఆరేళ్లకాలంలో రామానుజన్, హార్డీలు ఎంతగానో కలసి మెలసి వుంటూ గణిత రంగంలో విశిష్టమైన కృషి జరిపారు. కాని దురదృష్టవశాత్తు రామానుజన్ ఆ తర్వాత అనతి కాలానికే.... తన 32 వ ఏట క్షయవ్యాధితో మృతి చెందారు. ఆయన జరిపిన నిర్విరామ కృషి ఫలి

తంగా నోట్ పుస్తకాల మీద, చిత్తు కాగితాల మీద ఆయన నింపిన 4,000 కి పైగా గణిత సూత్రాలు మాత్రం తన తదుపరితరం కోసం రామానుజన్ వదలి వెళ్లిన అమూల్య సంపదగా మిగిలిపోయాయి. రామానుజన్ నిరంతరం ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొన్నందున ఆయన గణిత సూత్రాలను తొలుత ఒక పలక మీద వ్రాసి, వాటిలో తప్పులను సవరించిన పిమ్మటనే, కాగితం మీదికి ఎక్కించేవారు. 1976 లో పెన్సిల్వేనియా స్టేట్ యూనివర్సిటీ ప్రొఫెసర్ డాక్టర్ జార్జి ఆండ్రూస్ కంట పడి ఆయన ప్రపంచానికి బహిర్గతం చేసే వరకు కూడా రామానుజన్ గణిత సూత్రాలు కేంబ్రిడ్జిలోని ట్రినిటీ కాలేజీ లైబ్రరీ లోనే వుండిపోయాయి. రామానుజన్ తను రూపొందించిన 'తుది సూత్రాలను' మాత్రమే కాగితాల పైన నమోదు చేశారు. వాటికి సంబంధించిన 'వర్కింగ్ నోట్స్'ను మాత్రం ఆయన మిగల్చలేదు, దానితో ఆండ్రూస్, ఇతర గణిత పండితులు రామానుజన్ సూత్రాల పైన మళ్లీ ఏళ్ల తరబడి పని చేశారు. ఎన్నో దశాబ్దాల క్రితం రామానుజన్ ఎంతో సునాయసంగా పలక మీద, చిత్తు కాగితాల మీద చకచక రూపొందించిన సంక్లిష్ట గణిత సూత్రాల పరిష్కరణకు ఈ పండితులు అత్యాధునికమైన కంప్యూటర్లను వాడవలసి వచ్చిందంటే.... రామానుజన్ మేధ ఎంతటి విశిష్టమైనదో విశదమవుతుంది.... (అమెరికా సమాచారశాఖ

## బోట్స్వానా

ప్రపంచంలో పశువుల సంఖ్య విస్తృతంగా ఉంది. ఇవి మానవాళికి నిధి వంటివి. బోట్స్ వానాలో 60 శాతము పశు సంపద కొద్ది మంది ఆస్తిపరుల వద్దనే ఉంది. వీరు రాజకీయ నాయకులు, ఉద్యోగులు, ప్రజా నాయకులు. పాడిపరిశ్రమ లాభాల గురించి తెలిసినవారు. అయితే, నేలను సక్రమంగా వినియోగించుకొనే విధానాలను పట్టించుకోవడం లేదు. బోట్స్ వానాలో జరిగిన వారం రోజుల సమ్మేళనంలో పలువురు ఈ విషయాలపై చర్చలు జరిపారు. పశువులు మేతకు వెళ్లే అడవి ప్రదేశాలతో స్త్రీలకు ఎక్కువ పరిచయం ఉంటుంది. కనుక పురుషులకు పర్యావరణ విషయాలు బోధించడంతో సరిపోదు అని అన్నారు. పెరిగే జనాభా, పెరుగుతున్న కాలుష్యం, తరిగే పచ్చిక ప్రాంతాలు, వీటి కొరత, కొండలపైకి ఎక్కి అటవీ ఉత్పత్తులు సేకరించడం ఇలాటి విషయాలన్నీ స్త్రీలవే. పర్యావరణ వినాశనంతోబాటు వారూ నష్టపోతున్నారు. పెరుగుతున్న పేదరికం వల్ల స్త్రీలు తాము నివశించే ప్రాంతాల గురించి అవగాహన, సమతుల్యతలోని ప్రాముఖ్యత తెలిసినాకూడా జీవనాధారం కోసం ప్రకృతి వనరులని చెడగొట్టక తప్పడంలేదు. రసాయక పరిశ్రమలలో, స్వార్థపూరిత వ్యాపారా

లలో పర్యావరణాన్ని తీవ్రంగా వినాశనం చేస్తున్న విద్యావంతులకంటే బ్రతుకు తెరువు కోసమే అడవులలో తిరుగుతున్న నిరుపేదలు ఎలా బాధ్యులు అవుతారు.

(సర్వోదయా ప్రెస్ సర్వీస్

## పంజాబు

దేశంలో పండే ధాన్యంలో 60 శాతం పంజాబులోనే పండుతుంది. అలాగే పాల ఉత్పత్తిలో కూడా పంజాబు గణనీయమైన ప్రగతి సాధించింది. రాష్ట్రంలో రోజుకు తలసరి 642 గ్రాముల పాల ఉత్పత్తి జరుగుతుంది. దేశంలో జరిగే మొత్తం పాల ఉత్పత్తిలో ఇది 10 శాతం. 1955-60 లో రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో, సక్రమమైన పద్ధతిలో పాడి పరిశ్రమాభివృద్ధి కోసం రాష్ట్రంలో ప్రత్యేకంగా పాడి పరిశ్రమాభివృద్ధి శాఖను ఏర్పాటు చెయ్యటం జరిగింది. ఈ శాఖ 1962 లో అమృతసర్‌లోని వర్కాలో మొట్టమొదటి పాల కర్మాగారాన్ని నెలకొల్పింది. ప్రస్తుతం రాష్ట్రంలో పాలు, పాల ఉత్పత్తులకు సంబంధించి 12 కర్మాగారాలు పని చేస్తున్నాయి. వ్యవసాయ ఆధారమైన పంజాబు ఆర్థిక వ్యవస్థలో పాడి పరిశ్రమ సమతౌల్యాన్ని కలిగిస్తుంది. సుమారు 80 శాతం మంది చిన్న, సన్నకారు రైతులు తమ ఆదాయాన్ని పెంపొందించుకోవటానికి పాడి పరిశ్రమను చేపట్టారు. పైగా వ్యవసాయ భూమిలో ఎడతెరిపి లేకుండా పంటలు పండించడం, భూమిని చిన్న చిన్న కమతాలుగా వేయడం వంటి ఒత్తిడుల వల్ల ఆదాయార్జనకు వ్యవసాయేతర వృత్తుల ప్రాముఖ్యం పెరిగింది.

(పిఐబి



?

"How could Rama give asylum and protection to his enemy's brother ? What made him place so much trust in Vibheeshana ? Wasn't it a dangerous game, though it paid dividends in this case ?" questioned Raghu.

"Oh, my boy, that was all a part of state - craft, *Raja Neeti*, as they called it. It was Kabandha who guided Rama to make friends with Sugreeva but not Vali, the King of Kishkindha at that time. About Vibheeshana, Rama made enough of enquiries. When all the Vanara Chieftains were reluctant to the proposal of Vibheeshana being taken in, only one was for it...."

"Could it be Hanuman, Dad ?".

"Exactly. In the Court of Sugreeva, Hanuman was the last person from whom the opinion was to be elicited in this matter. While all others said 'no', it was Hanuman who pronounced an emphatic 'yes'. With a cheerful smile, Rama accepted his suggestion and got Vibheeshana crowned as the future king of Lanka, just like governments in exile. You know well how successfully Vibheeshana played his cards by wrecking Ravana's warfront. All the loop-holes were revealed at appropriate time. From Rama's side, it was an act of diplomacy - shrewd and subtle."

---





## డైరీ

డిసెంబరు 26, 1991

ప్రపంచం మొత్తం మీద మరింకే మహానగరంలోనూ లేని ఒక ప్రత్యేక సంగీతమయ వాతావరణం మద్రాసులో డిసెంబరు రెండోవారాన ప్రారంభమై, జనవరి మూడో తేదీ దాకా ఉంటుంది. పదిహేనుకి పైగా ప్రఖ్యాత సంగీత సభలు వున్నాయి. వీరందరూ సంగీత నాట్యోత్సవాలు ఈ సీజనులో విధిగా జరుపుతారు. ఉదయం పూట లెక్చర్ - డిమానస్ట్రేషన్స్; దానికి టికెట్లు వుండవు. ఆసక్తి గల ఎవరైనా వెళ్లి కూచుని వినవచ్చు. ప్రతిరోజూ ఔత్సాహికులకు అవకాశం యిస్తారు. నాలుగూ అయిదూ దాటాక జరిపే పాట కచ్చేరీలకు, నాట్య ప్రదర్శనలకు మాత్రమే రోజువారీ టికెట్లు, సీజన్ టికెట్లు వుంటాయి. కొన్ని సభలలో వారి వారి మెంబర్లకు ఉచితం. ఏమయితేనేం, మద్రాసులోని లలితకళామయ ప్రపంచం యావత్తూ డిసెంబరు నెల ద్వితీయార్థంలో సంగీత సాగర తరంగాల పై తేలుతూ ఉంటుంది. మిగతావన్నీ మర్చిపోయి ఆ లోకాన విహరించాలని ఉంటుంది గాని దైనందిన కార్య భారంలో అది సాధ్యంకాదు. 'గాన రవళి లేని దెక్కడ? ఆకుల రెప రెపలలో, నీటి గలగలలో వినిపించేది గానం కాదా?' - అని అడుగుతాడు బైరన్.... ఇవ్వాళ ఎలాగో అలా తెముల్చుకు బాలమందిర్ జర్మన్ హాలుకి వెళ్లాలనుకున్నాను (ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ - 59వ వార్షికోత్సవం) .... మూడు గంటలకు ఉషాలక్ష్మి కృష్ణమూర్తి సంగీత కచ్చేరి. వయొలిన్ : రాధ ; మృదంగం : గణేశ్ ; ఘటం : ఉమాశంకర్ .... త్యాగరాయకృతులు శాస్త్రోక్తంగా పాడారు. ముఖ్యంగా 'నారాయణ హరి' శ్రోతలను వుర్రూతలూపింది. కంఠమాధుర్యమూ ప్రశంసనీయమగు సాధన గల విద్వాంసురాలు ఉషా లక్ష్మి కృష్ణమూర్తి .... తర్వాత ప్రోగ్రామ్ బొంబయి సిస్టర్స్‌గా పేరొందిన సరోజా, లలితలది. వయొలిన్ : ఉషా రాజగోపాలన్ ; మృదంగం : బెంగుళూరు అర్జున కుమార్ ; ఘటం : సుకన్యా, రామ్‌గోపాల్. బొంబయి సిస్టర్స్ 'ఎందరో మహానుభావులతో

.... అనుకూల వాతావరణం ఏర్పరు చుకు, 'నీ భజన గాన రసికుల....' కృతితో శ్రోతలని ఆకట్టుకున్నారు. ఆపైన 'సీతా పతే....' లో 'ప్రేమ చూపి నాపై పెద్ద మనసు చేసి' చరణాన్ని సంగతులతో కడు శ్రావ్యం గా ఆలాపించారు .... చివరిదాకా కూచుని వినాలనివుంది గాని గంటల విభజనకు లోనై నడుమకోవాలాయె !

.... 27

'జస్టిస్ మోహన్ నాకు చిన్నప్ప ట్నుంచీ తెలుసు, మేమెంతో దగ్గిర వారము ; మా కుటుంబాలెంతో సన్ని హితమైనవి. కర్ణాటక హైకోర్టు ఛీఫ్ జస్టీసు పదవి నుంచి, సుప్రీమ్ కోర్టు జడ్జిగా ఆయన వెళ్లటం క్రమాను గత పరిణామం. 76 న్యాయమూర్తులు గల అలహాబాదు హైకోర్టు నుంచి ఢిల్లీ వెళ్ళడం మామూలు. కాని, మోహన్ కర్ణాటక నుంచి ఢిల్లీ వెళ్లారు. 25 ఏళ్ల నిజా యితీ, నిర్విరామకృషీ సత్ఫలితాన్ని యిచ్చాయి. జస్టిస్ మోహన్ యింకా ఉన్నత శిఖరాలు అందుకోవాలని ఆకాంక్షిస్తున్నాను' - అన్నారు సుప్రీమ్ కోర్టు జడ్జిగా రిటైరైన జస్టిస్ నటరాజన్, సిటీజన్స్ కమిటీ 'హేమా మాలిని'లో జస్టిస్ మోహన్ గౌర వార్థం ఏర్పరచిన అభినందన సభకు అధ్యక్షత వహిస్తూ. తమిళనాడు న్యాయశాఖా మంత్రి కృష్ణ స్వామి ; శక్తి గ్రూప్ ఛెయిర్మాన్ మహా లింగయ, సీనియర్ అడ్వకేట్ యన్ని రాఘవాచారి, ఇండియన్ బాంక్ ఛెయిర్మాన్ గోపాలకృష్ణన్, మైలా పూర్ అకాడమీ నరసింహన్, జస్టిస్ మోహన్ గురించి ప్రసంగించారు భర్తను యింతటి విశిష్టవ్యక్తిగా నిల బెట్టడంలో మిసెస్ మోహన్ పాత్ర గురించి సరోజినీ వరదప్పన్, ఎన్ని పనులు వున్నప్పటికీ సెయింట్ జాన్ అంబులెన్స్ విషయంలో జస్టిస్ మోహన్ చూపే శ్రద్ధ గురించి ఎతి రాజ్ కాలేజీ ప్రిన్సిపాల్ ఈవా మాచ్యు ఎంతో ఘనంగా పేర్కొ న్నారు... "నేను మైలాపూర్ వాసిని - మీ మధ్య తిరిగిన మనిషిని. మీరు గారు పొగుల శాలువాతో నన్ను సత్కరిస్తా వుంటే నా కెలాగో ఉంది. కాని, మీ మాట కాదనలేను. నా వాళ్లు నా పట్ల చూపే ఈ ఆదరం, అభిమానం, అనురాగం నన్ను పులకాంకితుని చేస్తున్నాయి.... చియస్సి చదివిన నేను 'లా' కాలేజీలో ప్రవేశించ డం యాదృచ్ఛికం.... న్యాయమూర్తిగా నిజం తెలుసు కోవడంలో నిబంధనల మధ్య పేదలూ సామాన్యులూ నలిగి పోకుండా నా వంతు మంచిపని చేసిన సందర్భాలనేకం వున్నాయి. సింగ పూర్ నుంచి వస్తూ స్మగ్లింగ్ కేసులో అమాయకంగా యిరుక్కున్న ఒక పేద రాలు, అసహాయురాలైన ఒక నర్సు ట్రాన్స్ఫర్ ఆర్డరూ - యిలాటివనేకం జ్ఞాపకం వొస్తున్నాయి. అవి చెప్పే సమ యం కాదిది. ఇన్ని ఆలయాలనుంచి వచ్చిన ఆశీర్వచనం, యిందరి హృద యాలలోని స్నేహ మకరందం నాకు

కొత్త ఊపిరినీ కొత్తశక్తినీ యిస్తోంది" - అన్నారు జస్టిస్ మోహన్ తనపై కురిపించిన అభినందన సుమదళాలకు సమాధానంగా.... రసహృదయులైన జస్టిస్ మోహన్ చక్కటి కవి, ఉన్నత భావుకులు, సమాజ సేవానురక్తిగల సహృదయులు. ఆయనతో పరిచయ మేర్పడ్డాక 'ఎంత మంచి వారు,' అని అనుకోకుండా ఉండలేరు. జస్టిస్ మోహన్ వంటివారు తమ స్థానానికి వన్నె తెచ్చే మహోన్నతులు.

## జనవరి 01, 1992

నూతన సంవత్సర శుభాకాంక్షలు పరస్పరం టెలిఫోనులోను, ముఖతాను చెప్పుకోవడంతో ప్రత్యూషోదయ మయింది. ఆ తర్వాత నవతా కృష్ణంరాజు ఆఫీసులో కాఫీ ఉపాహారాలతో బాటు పూతరేకుల పాకెట్లు. ఇవ్వాళ సెలవూ రేపు బందూ, 'బిసి ఐసి' వైజాగ్ ఫంక్షన్‌కి ఈ రాత్రి హౌరా మెయిల్‌కి ప్రయాణము అవడం వల్ల, మధ్యాహ్నమంతా ఆఫీసు రొటీన్. సాయంత్రం పొట్టి శ్రీరాములు హాలులో 'రచన (బియస్సార్ కృష్ణ) సమావేశం సంజీవదేవ్‌తో పరిచయ గోష్టి .... "శిల పున్నచోటనే ఉంటుంది - అది కదలలేదు - అందుకని అది ప్రాణం లేని దానికింద జమ. చెట్టు కదలదు - కాని, విస్తరిస్తుంది, ఆకులు, పువ్వులు, ఫలాలు యిస్తుంది. అందుకని దానికి ప్రాణం ఉన్నదంటాము. జంతువు కదులుతుంది - దానిని ప్రాణి అంటాము. మనిషి కదలడమే కాదు, మిగతా మూడిటికిలేని బుద్ధి, ఆలోచన ఉన్నాయి. తనకున్నది కేవలం బుద్ధి మాత్రమే కాదు - బుద్ధిని మించిన

అంతర్గత జ్ఞానమని మనోగతాన తెలుసుకో గలిగినది మానవుడు ఒక్కడే! దానినే ఆత్మ అంటారు. ఆ ఆత్మ స్వరూపమూ లక్షణమూ తెలుసుకో గల మనిషి, సర్వసాధారణ వ్యక్తులకు భిన్నమైన ఉన్నతునిగా రూపొందుతున్నాడు. ఈ లోకాన్ని అధి భౌతికంగా ఆధ్యాత్మికంగా విడమరిచి చూడగల శక్తి నిస్తుంది ఆత్మజ్ఞానం. సత్యమ్, శివమ్, సుందరమ్ అనడంలో మానవుని అన్వేషణా చింతన వెల్లడవుతుంది" - అన్నారు ప్రఖ్యాత సాహిత్య విమర్శకులు, చిత్రలేఖకులు, రస రేఖలు అనగా ఏమిటో తెలుగు వారికి చెప్పిన సంజీవదేవ్. ప్రశ్నోత్తరాలు వినాలని వున్నప్పటికీ, రాత్రి హౌరా మెయిల్‌కి వెళ్ళాలి గనక (భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ వారి 17వ జాతీయోత్సవం) మధ్యలో వచ్చేయవలసి వచ్చింది .... నిన్న రాత్రి 'ఇసిటివి' ప్రమీల, భారత్ ఎలక్ట్రానిక్స్ హరగోపాల్, 'హాపీ న్యూ ఇయర్' చెప్పడానికి వచ్చారు. ఈ రాత్రి గ్రిండ్లీస్ బాంక్ మోహన రెడ్డి 'ఎజి' ఆఫీసులో అకవుంట్స్ ఉన్నతోద్యోగిని వేదవతి, మేము యింటికెళ్ళేసరికి మా కోసం కనిపెట్టుకు నున్నారు. వారితో కాసేపు మాటలయాక భోజనం, రైలుస్టేషన్‌కి ప్రయాణం.

"భిలై, జమ్‌షెడ్ పూర్, విజయవాడలకి మళ్లే ఎసి స్లీపరూ ఫస్ట్‌క్లాసూ తెప్పించే అవకాశం లేదు - సెకండ్ స్లీపరులో మీకు లోయర్ బెర్త్ యిస్తారు. అక్కడ మీరు, వేదవతి బోటే 'సరోవర్'లో ఉంటున్నారు" అని పది పదిహేను రోజుల క్రితం చెప్పారు టివికె శాస్త్రి. "రావికొండల రావు, రాధాకుమారి వస్తున్నారు. మీ రూమ్స్ పక్కపక్కనే ఉంటాయి" అని కూడా చెప్పారు. 'బిసిఐసి' ఫంక్షన్‌కి వెళ్లినప్పుడు నా స్వంతం ఒక్క రూపాయి కూడా ఖర్చుకాకూడదనే "ప్రిన్స్‌పల్" ఆయనది అందుకని రానూపోనూ రైలులో ఖర్చులకయే నూట అరవై రూపాయిల లెక్కని, బెర్తూ బోగీ వివరాలు తెలిపే కవరులో పెట్టి, వారం రోజుల క్రితమే నాకు అందజేశారు. నా బెర్తుకి చెందిన విండోసైడ్ సీట్లో కూచున్నానో లేదో, వయొలిన్ తంబురా మొదలైన సంగీత వాద్యాలు నా ఎదుట బెర్తులో పరిచింది ఒక వనిత. ఆమె వెంట మరొకామె కూడా వచ్చారు. మొదట వచ్చినామె, రెండో ఆవిడను పరిచయం చేస్తూ, 'శ్యామలా భావె' అంది. శాస్త్రిగారి ఇన్విటేషన్‌లో అటువంటి పేరేదో చదివిన గుర్తు వుండటం చేత, 'మీరు వైజాగ్ వస్తున్నారా?' - అన్నాను 'కాదు - వాల్తేరు' - అంది - శ్యామలాభావె గాక ఆ రెండో ఆమె. 'రెండూ ఒకటే - చెన్నయ్, మద్రాసులా' అని నేను చెప్పేసరికి, వారికి కాస్త ఆశ్చర్యమయింది. "రేపు బంద్ గనక కోరమండల్ లేదట. అందుకని బెంగుళూరు నుంచి రేపు ఉదయానికి బదులు, ఈ సాయింత్రమే వచ్చాము మెయిల్‌లో మాకు రిజర్వేషన్ లేదు.

మీరు మద్రాసు చేరుకోండి - మా వాళ్లు ఏదో సరుబాటు చేస్తారు' - అని ఫోన్‌లో చెప్పారు శాస్త్రిగారు. మా బృందం మొత్తం ఎనమండుగురం" - అన్నారు వారిద్దరూ. "ఈ బోగీలో సుమారు నలభై మందిదాకా ఫంక్షన్‌కి వస్తున్నవారున్నారు. మీ అందరికీ బెర్తులు దొరక్క పోవచ్చు - మిమ్మల్ని ఎలాగో అలా తీసుకు వెళ్తారు మా కృష్ణమూర్తి. అదుర్దా పడక నిమితంగా కూచోండి" - అని వారికి ధైర్యం చెప్పాను. ఈ లోపున కృష్ణమూర్తి వచ్చారు. ఈ కృష్ణ మూర్తిని కలుసుకోవడం యిటువంటి ప్రయాణాల్లోనూ ఫంక్షన్స్ జరుగుతున్నప్పుడూను. మద్రాసు చేరుకున్నాక ఆయన పోర్ట్ ట్రస్ట్‌కీ (ఉద్యోగమక్కడ), నేను పత్రికా ప్రపంచంలోకి.... శ్యామలా భావె, నాగమణీ శ్రీనాథ్‌ల (హిందూస్థానీ - కర్ణాటక) జుగల్ బందీ, మొదటి రోజున ఉపన్యాసాలనంతరం.... భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీవారి జాతీయోత్సవాల విషయంలో రైల్వేవారు ఎంతో సహకారం చూపించడం యిది ప్రథమం కాదు – లోగడ అనేక సార్లు చూశాను - ఒక మంచి పనికి అందరూ ఎలా చేయూతనిచ్చేదీను. వోపెన్ టికెట్స్‌తో ఎక్కిన ఆ ఎనమండుగురిలో అయిదు గురికి ఈ రిజర్వ్‌డ్ బోగీలో బెర్తు సదుపాయం కలుగజేశారు టిసి. మిగతా ముగ్గురూ కాస్త

సర్దుకున్నారు.... విజయవాడలో 'ఎక్స్ ప్రెస్సో' కాఫీ తాగి, నా మిడిల్ బెర్తు మీద పడుకున్నాను, ఏడున్నరకి 'గుడ్ మార్నింగ్' అంటూ నాగమణీ శ్రీనాథ్, కాఫీకి ఆర్డరు చేసి, లేపారు. ఇక అక్కడ నుంచి 'వైజాగ్ చేరుకొనే దాకా ఆ బృందంలోని అందరితో విరామం లేని కబుర్లు అందులో ముగ్గురు బెంగుళూరు ఆకాశవాణి ఆర్టిస్టులు ; ఒకరు శ్యామలాభావె సోదరుడు - 'హెచ్ఎయల్' ఉద్యోగి (తంబురా), మరొక పెద్దాయన, విద్వాన్ గవాయ్, కన్నడలోని ఏకైక మ్యూజిక్ మాగజైన్ సంపాదకులు (హార్మోనియమ్). వయొలిన్ గోవిందస్వామి, మృదంగం కృష్ణమూర్తి, తబలా రవీంద్ర, ఫ్లూట్ కృష్ణానందమ్.... కావేరీ జలాలు, కస్తూరి పత్రిక, కన్నడ తెలుగు భాషల మధ్యగల అనుబంధం, ఏక లిపి కోసం సుబ్బరామప్ప ప్రయత్నం, మస్తి కన్నడిగుల ఆస్తి, ముగ్గురు కన్నడ సాహిత్య కారులకి జ్ఞానపీఠ్, రావడం - యిలా ఎన్నెన్నో ఎడతెరిపి లేకుండా! రాజమండ్రిలో ఇడ్లీ వడా అయాక, యింట్లో చేసి తీసుకువచ్చిన కారప్పూస, మిక్స్చరూ స్వీట్లూ వగైరా అందరికీ పేపర్ ప్లేట్లలో పెట్టియిచ్చారు శ్యామలాభావె వాటితోబాటు కమలా ఫలాలు, అరటి పళ్లు.... మరాఠీ థియేటర్‌లో సుప్రసిద్ధులైన విష్ణుదాస్‌భావె మనుమరాలు శ్యామల. తల్లిగారైన లక్ష్మీభావె వద్ద నుంచి గాత్ర మాధుర్యమూ, తండ్రిగారైన గోవింద విఠల్‌భావె నుంచి సంప్రదాయసరళి ఆమెకు లభించాయి. పాటలో లీనమై తన కంఠంలో ఆ తన్మయత పలికించగల విద్వాంసురాలు. పశ్చిమాసియా, కెనడా, అమెరికాలలో సంగీత కచ్చేరీలు చేసిన ఈమె 'చిత్రరాగ్' అను ప్రత్యేక స్వర కల్పన చేసి ఖండాతర ఖ్యాతి పొందారు. ఇక, నాగమణీ శ్రీనాథ్ మైసూరులోని మ్యూజిక్ కాలేజీలో లెక్చరరు - మద్రాసు శ్రోతలకు పరిచితురాలు. రేపు సాయింత్రం ఫెస్టివల్ గ్రవుండ్స్‌లో ఒకరు హిందూస్థానీ, మరొకరు కర్ణాటక పాడి, సభాస్థలిపై గాన సుధలు వెదజల్లనున్నారు.

సౌత్ సెంట్రల్ జోన్ వారి గుర్తింపు పొందిన నాగమణీ శ్రీనాథ్, రామనాథ్ కృష్ణన్ శిష్యురాలు. మద్రాసు మ్యూజిక్ కాలేజీలో విద్వాన్‌గా ఉత్తీర్ణురాలై, ఆపైన పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేసి, ప్రస్తుతం మహారాణీ కాలేజీలో (మైసూరు) సంగీతశాఖాధిపతిగా ఉంటున్నారు. ఆకాశవాణికి, దూరదర్శినికి చిరపరిచితురాలు ; 'సునాద' అనే కల్చరల్ సెంటర్ నిర్వహిస్తున్న ఈ 'గాన విశారద' అయిదు కాసెట్లు యిచ్చారు ; మూడు సంవత్సరాలు వరసగా మద్రాసు మ్యూజిక్ అకాడమీలో 'ఉత్తమ గాయని' గా సత్కారం పొందారు.

వాల్తేరు ప్లాట్‌ఫారమ్ మీద కంపార్ట్‌మెంటులో నుంచి దిగానో లేదో, 'బిసిఐసి' బాడ్జి ధరించిన ఆనందమోహన్ (బియల్ విద్యార్థి) - 'మీరు చందూర్‌గారు కదా ?'

అని అడిగాడు - నా షర్టుని బట్టి నన్ను యిట్టే పోల్చుకోవచ్చు. మరొక కంపార్ట్‌మెంటులోవున్న రావి కొండల రావు దంపతులని, నన్నూ ఫెస్టివల్ కారులో 'సరోవర్'కి తీసుకొచ్చాడు. నా రూమ్ 306; కొండలరావు దంప తులది 307. ఆరోతేదీన మళ్లీ మేము రైలు ఎక్కేదాకా మా వాహన సౌకర్యమూ, యితర ఏర్పాటులూ చూడవలసిన బాధ్యత ఆనంద మోహన్‌ది... స్నానాలూ టిఫినులూ అయాక, నాలుగు గంటలకి కారు ఎక్కాము. కొండలరావు, రాధా కుమారి వారి బంధువుల యింటి వద్ద దిగిపోయారు. నేను ఫెస్టివల్ గ్రవుండ్స్‌కి వెళ్లాను.... స్టేషన్ నుంచి రూమ్ కొచ్చిన పావుగంటలోనే శాస్త్రి గారి వద్ద నుంచి ఫోన్ 'ప్రయాణం బాగా జరిగిందా? రూమ్ 'కమ్‌ఫర్ట బుల్'గా ఉందా?' - అని! అదే ఆయనలోని విశిష్టత, ప్రత్యేకత. తాను నియోగించిన వ్యక్తి, అతిధి మర్యాద సక్రమంగా చేసినప్పటికీ, తను స్వయంగా పల్కరించి 'హల్లో' చెప్పాలి.... సువిశాలమైన వేదిక, దీపతోరణాలు, మైకులు, ఆహూతు

లకు వేరు వేరు స్థలాల కేటాయింపు, కార్య నిర్వాహకుల, కళాకారుల ఎంట్రెన్స్; కార్లకు వేర్వేరు గేట్ పాస్‌లు; ఎక్కడికక్కడ వాలంటీర్లు, పోలీసు సిబ్బంది; మొత్తం 33 ప్రవేశ ద్వారాలు.... అక్కడున్న కొందరు పెద్దలకు శాస్త్రిగారు నన్ను పరిచయం చేశారు. ఈ మూడు రోజుల విశేషాలు 'జగతి - డైరీ'లో వస్తాయని చెప్పారు.... గరిమెళ్ల రామ్మూర్తి, యస్ ప్రభాకరరావు, యస్వెస్ రాజు వంటి పూర్వమిత్రు లతో కాస్త యిష్టా గోష్ఠి అయ్యాక, నన్ను 'సి-షెల్స్'కి తీసుకు వెళ్ల మన్నాను ఆనందమోహన్‌తో... రమణయ్య రాజా యింకా యింటికి వెళ్లలేదు - అక్కడే వున్నారు - అరు న్నర దాటినా! మొన్న ఉదయం 'న్యూయియర్ గ్రీటింగ్స్' ఫోన్‌లో చెబుతున్నప్పుడు అన్నాను - యీ ఫెస్టివల్‌కి వస్తున్నట్టు! ఒక అర గంట సేపు మద్రాసు మిత్రుల గురిం చిన యోగక్షేమాలయాక, కారెక్క బోతూండగా రాజాగారు అన్నారు; 'రేపు ఉదయం ఎనిమిదిన్నరకి గణపతి (డ్రయివర్) మీ దగ్గిరికి వస్తున్నాడు - బ్రేగ్‌ఫాస్ట్‌కి మీరొస్తు న్నారు' అని! ఆయన మాటకు తిరుగు లేదు. అపూర్వ స్నేహ బంధంతో కట్టివేసే ఆప్తమిత్రు లాయన. మర్నాడుదయం బ్రేక్‌ఫాస్ట్ కాదు, ఆరో తేదీన మద్రాసు మెయిల్ ఎక్కేదాకా, స్నేహ పరిమళం నా చుట్టూ అలుముకు పోయింది. మాటల కందని మకరందమది.

. . . . . 03

'కృపా' యాపార్ట్‌మెంటులోకి వెళ్ల గానే జిలిబిలి పలుకుల మూడేళ్ల మాధవ్ (కృష్ణారావు శ్రీదేవిల చిరంజీవి) 'మాలతీ అంటీ ఏది?' అని ప్రశ్నించాడు. ఆ బాలుని సమాధాన పరిచి, బ్రేక్‌ఫాస్ట్ అయాక, 'సీషెల్స్'కి వచ్చాము.... వాల్తేరు అప్‌లాండ్స్ లోని కృపాహిల్స్ మీద, ఒక వైపు సాగర తరంగాలూ మరొక వైపు ప్రకృతి పచ్చదనమూ కనువిందు చేసే రామణీయక ప్రదేశంలో, 19 వేల చదరపు గజాల విస్తీర్ణంతో, 176 అధునాతన యపార్ట్‌మెంట్సూ, 20 వరసక్రమ నివాస గృహాలూ మొత్తం 196 కుటుంబాలకు, చూడ చక్కని ఆరోగ్యవంతమూ ఆహ్లాద జనితమూ అగు గృహవసతి ఏర్పడు తున్నది. తలదాచుకొనే యిళ్లు కాదు, నేటి జీవితవిధానానికి అనుకూలమైన అందచందాల మందిరాలు. ఒకొక్క దాని 'ప్లింత్ ఏరియా' (లోపల విస్తర్ణం) 925 చ॥ అడుగుల నుంచి 2550 చ॥అ॥ దాకా ఉంటుంది. ప్రస్తుతపు ధర అయిదు లక్షల నుంచి పదకొండూ పన్నెండు లక్షల దాకా. ఆంధ్రాలో తలమానిక మనిపించుకో దగ్గ ఈ కాంప్లెక్స్ వివరాలు మరొక సారి ఎప్పుడైనా చెబుతాను. 'కనస్ట్రక్షన్ స్పాట్'లో కాసేపు గడిపి, ఆఫీసులోకి వచ్చాము. అక్కడొక పావుగంట

అయాక, పాండురంగాపురంలోని 'సాగ రిక'కు ద్వివేదుల విశాలాక్షి, డియస్ రావుల ఫ్లాట్‌కు - వెళ్లాము - రాజా గారూ, నేనూ.... 'మీరిలా ఫ్లయింగ్ విజిట్ అయితే ఎలా? ఆదివారం సాయింత్రం డిన్నర్ కొచ్చి, యిక్కడ వుండిపొండి. సోమవారం పొద్దుటే మిమ్మల్ని మీ హెూటల్లో దింపుతాను'- అన్నారు డియస్ రావు. కనీసం నాలుగు మూడు గంటలు కూచుంటేగాని మాకు మాట్లాడుకున్నట్టు వుండదు - పాతికేళ్ల ప్రేమ పాశం ... 'ప్రయత్నం చేస్తాను - ఒకవేళ రాలేకపోతే మీరు ఏమీ అనుకూడదు' - అని నెమ్మదిగా చెప్పుకున్నాను ఆ దంపతులకి. ఎంచేతనంటే, ఆదివారంనాడు ఆంధ్రా యూనివర్సిటీ, 'దలైలామా'కు డాక్టరేట్ యిస్తున్నారు. 'మై లాండ్ అండ్ మై పీపుల్' (My Land and My People - నా దేశం, నా ప్రజలు) పుస్తకం వెనకెప్పుడో చదివాను. కాన్వొకేషన్ వేళ ఆయన చెప్పే పలుకులు వినాలనీ ఆయనని చూడాలనీ తహతహగా ఉంది ... మధ్యాహ్నం రాజాగారింట్లో భోజనమయాక, 'సరోవర్'కి వచ్చేశాను.

ఇవ్వాళ మొదటి రోజు గనక మూడుగంటలకే సభా ప్రాంగణం చేరుకోవాలి. కారుకి ఆర్టిస్ట్ గేట్‌పాస్ ఉంటే తప్ప సాంబమూర్తి హాలు వెనక తట్టుకి పోనివ్వరు. అదంతా ఆనంద మోహన్ బాధ్యత. రాధా కుమారి. కొండ్రావు, నేను కంపీరర్స్ (కార్యక్రమ ప్రయోక్తలు) భారతి,

## ముఖ చిత్రం



1991 డిసెంబరు రెండవ తేదీన, 5 కోట్ల 20 లక్షల జనాభా గల యుక్రెన్, సోవియట్ యూనియన్ నుంచి విడిపోయి, స్వాతంత్ర్యం ప్రకటించడంతో, నాలుగు నెలల ముసుగులాట ముగిసింది; 74 ఏళ్ల సామ్యవాదనౌక సముద్ర గర్భంలోని రాతిని ఢీ కొని, ముక్క చెక్కలయింది. 1945లో యుక్రెన్‌కి ఐక్యరాజ్య సమితి సభ్యత్వం కలిగించాడు స్టాలిన్. సమితిలోని ఒక దేశంగా, యుక్రెన్ స్వాతంత్ర్య ప్రతి పత్తిని, డిసెంబరు మూడో తేదీన పాశ్చాత్య దేశాలతో బాటు జర్మనీ, కెనడా, అమెరికా గుర్తించాయి. ఒక విధంగా అది సోవియట్ కేంద్రాధికారాన్ని భూస్థాపితం చేయడం. యూక్రెన్ అధ్యక్షుడు క్రవ్‌షక్ ప్రాంతీయతా గానం, కాల గమనంతో పల్చబడక తప్పదు. తన దేశ ప్రజలు బంధాల నుంచి బయట పడి, స్వాతంత్ర్య సమీర సుగంధం తెలుసుకోవాలని అభిలషించిన గొర్బచెవ్, ఆ బృహత్ప్రయత్నంలో తనే ఒక సమిధగా చారిత్రక ధూళిలో కలిసిపోవడం, ఒక వింత పరిణామం. రెండవ ప్రపంచ యుద్ధంలో ఘన విజయం సాధించిన విన్‌స్టన్ చర్చిల్ ఎన్నికలలో ఓడిపోయినప్పుడు చిరునవ్వుతో చెబుతాడు: ప్రజాస్వామ్యం అంటే యిదే - అని! గొర్బచెవ్ విషయంలోనూ అంతే!

కళ మూడయేసరికి వేదిక చేరుకున్నాం. వారిది చెప్పే పని - నా కంటూ ప్రత్యేకంగా పనేమీలేదు ; చూడటం, చూసినది ఆ తర్వాత నాకు తోచిన మాటలలో నా తృప్తి కోసం చెప్పడం ....“డేబ్భైయ్యేళ్ల సామ్యవాద ప్రయోగం రష్యాలో ఘోరంగా విఫలమయింది. కాని ఈ భారత జాతిని అనాది నుంచీ ఒకటిగా ఏకోన్ముఖంగా నిలబెడుతున్న తత్త్వ సారం - ఫిలాసఫీ - ఆర్థిక సూత్రాలు సిద్ధాంతాలూ కంటె ఎంతో గొప్పది. 7 వేల కి॥ మీ॥ సముద్ర తీరం మనది. సమైక్యతా సందేశాన్ని నలుమూలలకీ సంగీత నాట్యాదుల ద్వారా వెదజల్లుతున్న భారత కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ వారి ఈ 17వ జాతీయోత్సవం - అనుభవజ్ఞులైన మాజీ ఉపరాష్ట్రపతి బిడి జెట్టి అధ్యక్షులుగా, అనుపమ కార్యదీక్షా దక్షులైన టివికె శాస్త్రీజీ సారథ్యంలో నిర్వహింప బడుతున్న ఈ ఫెస్టివల్ - వివిధ ప్రాంతాలలోని ప్రజల మధ్య సుహృద్భావమూ ఏకోన్ముఖ లక్ష్యమూ నెలకొల్పే లలితకళా వేదిక” అన్నారు కేంద్ర సమాచార మంత్రి అజిత్‌కుమార్ పాంజా, కర్పకవల్లి స్వాగత నాట్యంతో ప్రారంభమైన మూడు రోజుల పండగకి జ్యోతి వెలిగించి! విశాఖ మేయరు డివి సుబ్బారావు, పోర్ట్‌ట్రస్ట్ చెయిర్‌మాన్ పివిఆర్‌కె ప్రసాద్, జిల్లా కలెక్టరు ప్రదీప్ చంద్రా, పోర్ట్‌ట్రస్ట్ ఉపాధ్యక్షులు కిషోర్‌రావు, పోలీసు కమీషనర్ ఎమ్వి కృష్ణారావు, టిటిడి చెయిర్‌మాన్ సుబ్బరామి రెడ్డి, పోర్ట్‌ట్రస్ట్ మేనేజరు తిరుపతిరాజు, స్థానిక కన్వీనర్లు ప్రభాకరరావు, యనెస్ రాజు, ఈనాటి ఉత్సవంలో పాల్గొంటున్న కళాకారులూ వేదిక మీద ఆశీనులయారు.... ముఖ్య అతిథి ఉపన్యాసానికి ముందు టివికె శాస్త్రి 'బిసిఐసి' లక్ష్యాలు వివరించి, ఇటువంటి ప్రోగ్రామ్‌లు టివి నేషనల్ నెట్‌వర్క్ ద్వారా అధిక సంఖ్యాకులకు అందజేయడం సమైక్యతా కృషిని బలపరిచినట్టవుతుందని కేంద్ర మంత్రికి సూచించారు. విశాఖపట్నంలో లోగడ రెండు ఉత్సవాలు జరిపింది ఈ కమిటీ - యిది మూడవది. సత్కారాలు, అభినందనలు, ప్రభాకరరావు వందన సమర్పణ అయాక, శ్యామలా భావె హిందూస్థానీ, నాగమణి శ్రీనాథ్ కర్ణాటక - గాత్ర కచ్చేరీ, జుగల్ బందీ. ఇద్దరూ తమ విద్వత్ చూపించారు. పక్క వాద్య కారుల గురించి వెనక చెప్పాను గనక పునశ్చరణ అనవసరం.... యన్నెస్‌రాజు మాకని కేటాయించిన షామియానాలోనే కాఫీ - టీలు ఏర్పాటు చేయించడం వల్ల, కమ్ముకుంటున్న పొగ మంచు, రివ్వున వీచే చలిగాలి - వాటి ప్రభావం మాకంతగా తెలిలేదు.... కన్యాకుమారి వయొలిన్, జనార్దన్ సితారా - ఈ రెండు వాద్యాలతో జుగల్ బందీ ఎనిమిదింపావుకి ఆరంభమయింది. అంత చలిలోను శ్రోతలు తల మీద

ఆచ్ఛాదనతో ఎంత శ్రద్ధగా అలకరించారో చూస్తేగాని నమ్మలేరు. ఈ చలి రోజులు గాక మార్చి నెల అయితే ఎంత బావుండేది, మరింకెంత మంది ఆనందించి వుండేవారో అనిపించింది. 'భోజనాలు చేసి వద్దాం' అన్నారు రాధాకుమారి, యస్వెస్ రాజు. వంద గజాల దూరంలో, సాంబమూర్తి హాలుని అంటి పెట్టుకునున్న 'సీతారామ కళ్యాణ మందిరం'లో, ట్రిప్లికేన్ నుంచి వచ్చిన వంటవారు తయారు చేసిన వేడి వేడి భోజనాలు. హొటల్‌రూమ్‌కి వచ్చే అరుగిన్నెల అర్భాటంకాదు - తుడిచిన విస్తట్లో ఒక కూర, ఒక పచ్చడి, అప్పడం, సాంబారూ, రసమూ, ఆవునెయ్యీ, పెరుగూ - అడిగి వడ్డించే మనుషులు, ఆప్యాయత కనబరిచే ముఖాలు.... మాతోబాటు మా ఫ్లోర్‌లోనే 'సరోవర్'లో ఉంటున్న గరిమెళ్ల రామ్మూర్తి అన్నారు; 'ఉదయం కాఫీ తప్ప, రెండుపూట్లా టిఫినూ, భోజనం. యిక్కడేనని!' ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, వేదిక మీద కనిపించే ప్రోగ్రామ్ వెనక ఎంత భారీ ఏర్పాటు ఉన్నదో తెలియాలని. ఒకొక్క ఉత్సవానికి నూట పాతిక నుంచి నూటఏభై మంది దాకా మద్రాసు నుంచి రావాలి. వారి ప్రయాణ సౌకర్యాలేగాక వసతి, భోజన సదుపాయాలు యిలాటివన్నీ చూడాలి. ఇవన్నీ ఒక్క చేతి మీద శాస్త్రిగారే ప్లాన్ వేస్తారు; ఇతరులు వేయగలిగిందేమిటంటే, ఆప్లాన్‌ని క్రమం తప్పకుండా అమలు పరచడం, ఆచరణలోకి తేవడం... కన్యాకుమారి, జనార్దన్‌ల జుగల్‌బందీకి మృదంగం షణ్ముఖం రాజారావు, తబ్లా సదానన్. మొదటి రోజు కార్యక్రమం ముగిసేసరికి పదిన్నర అయింది. ఆనంద మోహన్ మమ్మల్ని హొటల్‌కి చేర్చాడు.

..... 04

ఇవ్వాళ అయిదు గంటలకి గీతా కృష్ణమూర్తి వీణానాదంతో ప్రోగ్రామ్

---

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము. చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

---

ప్రారంభం కాగా పివిఆర్‌కె ప్రసాద్ స్వాగత వచనం తర్వాత, కుమరేష్ గణేశ్‌ల వయొలిన్ డ్యుయట్ ఎంతో రక్తి కట్టింది. చలి నిన్నటి కంటె కాస్త ఎక్కువ. అయినప్పటికీ ప్రజలు అధిక సంఖ్యలో వచ్చారు - ప్లేబాక్ సుశీల పాట వినేందుకు! ఎవి రాజ్‌ఆర్కెస్ట్రా. సుశీల, రామకృష్ణల సినీ సంగీతం. పాటలన్నీ వినాలనే అసక్తితో, ఎనిమిదింపావుకి ముందే భోంచేసి వచ్చి కూచున్నాం - నేనూ యన్నెస్ రాజూ. శనివారం గనక రాధాకుమారి టిఫిన్ తిని, కొండల్రావుకి టిఫిన్ పొట్లం పట్టుకొచ్చారు. కార్యక్రమం ముగిసేదాకా, కాఫీ-టీలకు యిబ్బంది లేదు. అడగడమే తడవుగా రెడీ - వెచ్చటి పానీయం.... వటపత్రశాయి, తీపి తీపి తెలుగు, నీవుండేది ఆ కొండపై, చిటపటచినుకులు, హిమ గిరి సొగసులు, రాధికా, హాయిగా నిదురపో .... వంటి రస ప్రపూర్ణ గీతికలలో ప్రేక్షకులని ఆనందింప జేశారు సుశీల, రామకృష్ణలు ... ఆనంద మోహన్ మమ్మల్ని హొటల్ చేర్చేసరికి పదకొండున్నర అయింది.

. . . . . 05

ఉదయం ఎనిమిదిన్నరకి యథా ప్రకారం గణపతి (డ్రయివర్) రాక - కొండల్రావు దంపతులు, నేను రాజా గారింటికి బ్రేక్‌ఫాస్టుకి. 'బాటా' రామారావు, ఆయన కుమార్తె, మరో యిద్దరూ కూడా వచ్చారు. 'రాజా - లక్ష్మీ' హైదరాబాదు ఫంక్షన్ (నవంబరు 19, 1991) విడియోలో చూస్తూ, తెలిసినవారి గురించి చెప్పు కుంటూ, ఇడ్లీ, పెసరట్, ఉప్మాతో బాటు రెండు స్వీట్లు. ఆ ఇడ్లీ మామూలుది కాదు - రౌండ్ షేప్‌లో దిట్టంగా ఉంది. మామూలువి మూడు ఇడ్లీలకు సమాన మనవచ్చు. టిఫిన్లయాక, 'సి - షెల్స్'కి, అక్కడనుంచి మూర్తి గారింటికి; ఇవ్వాళ ప్రోగ్రామ్ పన్నెండు నుంచే గనక, కొండల్రావు దంపతులని 'సరోవర్'లో దిగబెట్టి, నేను 'పల్లవీ ఫ్లాట్స్'లోని సుందరీ హనుమంతరావుల యింటికి లంచ్‌కి. మద్రాసులోని రొదా, ట్రాఫిక్కూ భరించలేక, అశోక్ నగర్‌లో తమ కున్న చక్కటి యిల్లు అమ్మేసి, యిక్కడ యపార్ట్‌మెంటు కొనుక్కున్నారు హనుమంతరావు. పెద్ద కూతురు శారద, అల్లుడూ స్టేట్స్‌లో ఉన్నారు. రెండో అల్లుడు విక్రమ్‌కి 'ట్రూబా'లో ఉద్యోగమవడం వల్ల, కూతురు పద్మ తలిదండ్రుల వద్ద వుండి, జాబ్ చేస్తోంది. మెడికల్ ఫర్మ్‌లో పనిచేస్తున్న కొడుకు ప్రభ, వీరింటికి చేరువలోనే ఫ్లాట్ కొనుక్కున్నాడు. ఇరువైపుల బంధువులు ఆ చుట్టూనూ ఆ ప్రాంతాల ఉన్నారు. మద్రాసు పాట కచ్చేరీలకు అలవాటు పడ్డ సుందరి (ఆమెకు చాలా చక్కటి సంగీత జ్ఞానం ఉంది) మొదట్లో ఈ మార్పుకి సుముఖంగా లేకపోయినా, హనుమంతరావుగారి నిర్ణయం కరక్టే నని ఒప్పుకోక తప్పదు. లోగడ, వారున్న అశోక్‌నగర్‌తో పోల్చి

చూస్తే ఈ ప్రాంతమూ, ఈ వాతావరణమూ ఎంతో హాయిగా ఉన్నాయి. యపార్ట్‌మెంటు ఎంతో సదుపాయంగా ఉంది. ఫామిలీ ఫ్రెండ్స్‌యిన కాల్టెక్స్ కామేశ్వరరావు దంపతులని లంచ్‌కి పిలిచారు. ప్రభ, అంటే వారబ్బాయి, కూడా వచ్చాడు గంటా గంటంపావు కంటె ఎక్కువ గడిపే అవకాశం లేక పోయింది .

మూడున్నరకి ఆంధ్రా యూనివర్సిటీ కాన్వొకేషన్‌కి, దలైలామాని చూసేందుకు. నాకోసమని ప్రత్యేకంగా తెప్పించారు ప్రవేశ పత్రం రాజా గారు. ఆంధ్రా గవర్నరు కృష్ణకాంత్, త్రివిష్టపుల ఇలవేల్పు దలైలామా వస్తున్నారు గనక బందోబస్తు గట్టిగా ఉంది. గుప్తాగారు, రాజాగారు, నేను వెళ్లాం.... ఈ 62వ స్నాతకోత్సవం మూడు సంవత్సరాల తర్వాత జరుగుతూండటం వల్ల, పట్టాలు ప్రయిజులూ పంపకం గంటా గంటన్నర తీసుకుంది. వైస్ ఛాన్సలర్ గోపాలకృష్ణా రెడ్డి, ఛాన్సలర్‌ని, (గవర్నరు), పూజ్యులు దలైలామాని, పట్టభద్రులను, ఆహూతులను ఉద్దేశిస్తూ, నూతన విద్యావిధానం, వాతావరణ

కాలుష్యం, పరిశోధక శాఖలు, కట్టడ నిర్మాణ సమస్యలు, బయట దేశాల నుంచి విద్యార్థి బృందాల రాకపోకలు, సాంకేతిక సిబ్బంది, కార్య నిర్వహణ - యిలా తమ విశ్వవిద్యాలయ సంబంధమైన అంశాల గురించి వివరించారు.... "మన మనసు మనం తెలుసుకు, మనసులో మాట చెప్ప గలగాలి. డోలాయ మానంగా ఉండటం తగదు - నిశ్చల బుద్ధి అలవరచుకోవాలి. నిశ్చల తత్వమే నిర్మలమైన మనసుకి దోహదకారి. దేనికైనా సహృదయత చాలా అవసరం. దయాగుణాన్ని మించిన ఐశ్వర్యం ఈ లోకంలో లేదు. Compassion and Love - కరుణ, ప్రేమ. కరుణ రస వాహినిలోనే ఆనంద వీచికలు వున్నాయి. బుద్ధుడు, మహా వీరుడు తమ జీవితాల ద్వారా మనకేమి చెప్పారో మర్చిపోకూడదు - ఆ వెలుగులోనే మనం అడుగువేయాలి. అహింసను మించిన దివ్యాస్త్రం మరొకటి లేదు. అహింసలోని తేజో బలమే మన ప్రాచీన నాగరికతను పెట్టనికోట వలె కాపాడుతున్నది. దానాలన్నిటిలోకీ అన్నదానం గొప్పది. ఈ దయాగుణమూ ఈ సంపదే మన విలువలకు పునాది" - అంటూ పది హేనూ ఇరవై నిముషాలసేపు మాట్లాడారు దలైలామ. ఆ సౌజన్యమూర్తి కంఠం నుంచి వెలువడవి నోటి మాటలు కావు - అమృతవాక్కులు. (1935 జులై 6వ తేదీన తూర్పు టిబెట్‌లోని అమ్‌డొ రాష్ట్రంలో టక్స్టర్ అనే చోట, చొక్యాంగ్ - డికి దంపతులకు 9వ సంతానంగా జన్మించిన బాలుని, బౌద్ధమత గురువులు (లామాలు) 1937లో 14వ దలై లామాగా గుర్తించి, ప్రధాన పట్టణమైన లాసాకు పట్టుకు పోతారు. నియమ నిష్ఠలతో పెరిగిన ఈ బాలుడు 1950 నాటికి విద్యాభ్యాసం పూర్తి చేసి పట్టభద్రుడవుతాడు. కమ్యూనిస్ట్ పాలనలోకి వచ్చిన నవ చైనా 1959లో టిబెట్ పై దురాక్రమణ జరిపేందుకు సంసిద్ధం కాగా, జవహర్‌లాల్ నెహ్రూ ఆహ్వానం మీద, తన సిబ్బందితో, హిమాచల ప్రదేశ్‌లోని 'ధర్మశాలా' చేరుకుంటాడు దలైలామా. ఆనాటి నుంచీ ఆయన ఉంటున్నది అక్కడే! మత సహనాన్ని, శాంతి సందేశాన్ని విశ్వవ్యాప్తం చేసే ఈ పూజనీయుడు 1987లో అమెరికన్ కాంగ్రెస్ సభ వారికి పంచ సూత్రావళి ప్రతిపాదించాడు. అలాగే ఫ్రాన్సులోని స్ట్రాట్ బరోలో జరిగిన యూరోపియన్ పార్లమెంటు ముందు కూడా యిదే ప్రతిపాదన వుంచాడు. 1989లో నోబెల్ శాంతి బహుమానం పొందిన దలై లామా, నేటి కల్లోల ప్రపంచంలో ఒక అనుపమ శాంతిదూత).... శాస్త్రి గారి సభావేదిక చేరుకొనేసరికి అరున్నర అయింది....

బాలాజీ సంగీత కళ్యాణోత్సవం పళని స్వామి బృందం వారి నాద స్వరంతో ఒంటి గంటా రెండు నిముషాలకు ప్రారంభం కాగా, విశ్వ

రూప దర్శనం, నవనీత హారతి; నారాయణ, యస్ కామేశ్వరి, భాగ్యలక్ష్మిల భక్తి పాటలు, బండారు చిట్టిబాబు ఆర్కెస్ట్రాతో; విజయేశ్వరరావు వయొలిన్, సద్గురు చరణ్ మృదంగంతో సుధారాణి కృతులు; దీపా వెంకటరామన్ నాట్యం; నేత్ర దర్శనం, తీర్థాభిషేకం, వేదపఠనం; 'ఐఒబి' ఛైర్మన్ గోపాలకృష్ణన్ చేత అతిథులకు సన్మానం - యివన్నీ అయిపోయాయి నేను వచ్చేసరికి! శివరామన్ వయొలిన్, వైద్యనాథన్ మృదంగంతో సుధా రఘునాథన్ పాడుతున్నారు ... అన్నమయ్య పదాలు ఆమె గాత్రంలో మధుర గాన మంజరులై శ్రోతలను పరవశింపజేశాయి. ఈ గాన స్రవంతికి తోడుగా కామిశెట్టి శ్రీనివాసుల వాగ్ధారలో వెంకటేశ్వరుని వర్ణనా వైభవం. రసరమ్యలోకంలోని ఈ సాంప్రదాయిక తంతు అంతా భక్తులని సంతోష పెట్టే విద్విలాస లీల. సుధా రఘునాథన్ కంఠంలో 'క్షీరాబ్ధి కన్యక' వెన్నెలలు కురిపించింది.... సుబ్బారావు హార్మోనియమ్, సదానంద్ తబ్లాతో ప్రఖ్యాత గాన విశారద లక్ష్మీశంకర్ భక్తి సుమాలు వెదజల్లారు.... స్వామివారి ఊరేగింపు. ఎందరో సదస్యులు వేదిపై ఆశీనులై వీక్షిస్తూండగా, పివిఆర్ కె ప్రసాద్ దంపతులు, శ్రీ వెంకటేశ్వర కళ్యాణ మహోత్సవం శాస్త్రోక్త విధులతో, పెళ్లి మంత్రాలతో జరిపించారు.... హారతి యిచ్చాక, పవళింపు సేవ....

ఈ ఉత్సవం చూడటానికి వచ్చిన యావన్మందికీ ప్రసాదం పంచి పెట్టారు.... సామాన్యుని స్వప్న సాఫల్యంలోనే లోక కళ్యాణం ఉంది .... ప్రత్యక్షంగా చూపిన వారికి, ఎందరు మహానుభావులు ఈ మూడు రోజుల ఉత్సవ విజయానికి నడుం కట్టి నిలబడ్డారో తెలుస్తుంది.... తాను కేవలం సమన్వయ కర్తననీ, యిది జరిపిస్తున్నది తనకు తెలియని అదృశ్య శక్తి అనీ, ఈ సమైక్యతా కృషిలో తాను నిమిత్తమాత్రుణ్ణనీ ఎప్పటి కప్పుడు చెబుతూ వుంటారు శాస్త్రి గారు. ఆ ఆత్మ పరిశీలనా పటిమే, ఆయనకు అలసట నెరుగని ద్విగుణీ కృతోత్సాహాన్ని యిస్తోంది. శాస్త్రి గారు శ్రీమంతుడు కాదు - సామాన్య కుటుంబీకుడు. ఆయనకు గల అర్థ బలమూ, అంగబలమూ కూడా పరి మితమైనవి. కాని, యింత భారీఎత్తున పదిహేడు జాతీయోత్సవాలు, దేశ సమైక్యతాధ్యేయంతో జరిపిన వ్యక్తి, యావద్భారతంలోనూ మరొకరు లేరని చెప్పవచ్చు. ఇది పొగడ్త కాదు - కళ్ల ముందు కనిపిస్తున్న వాస్తవం.

. . . . 06

వెళ్తున్నప్పుడు కృష్ణమూర్తి గ్రూప్ లీడరైతే, వస్తున్నప్పుడు గురుమూర్తి. ఇరువురూ పోర్ట్రెస్ట్ ఉద్యోగులే! వెళ్తున్నప్పుడు ఎడతెరిపిలేని కబుర్లు; వస్తున్నడు కాసేపు పత్రికలు చదు వుకు, నిడదవోలులో రైల్వే వారి భోజనం రుచి చూసి, విజయవాడ వచ్చిన సంగతి కూడా తెలియని నిదుర. వెలుతురు రాక పూర్వం యిళ్లు చేరుకున్నాము.... 'ప్రసాదం శాస్త్రిగారిచ్చారు - ఈ యాపిల్స్ ఎక్కడివి?' - అంది మాలతి. రైలులో తినేందుకు రాజాగారిచ్చారు - అన్నాను.

. . . . . 08

రోజారమణి, చక్రపాణి దంపతుల కుమారుడు మాస్టర్ తరుణ్, 'అంజలి' లో యాక్ట్ చేశాడు; ఇంకా చాలా చిత్రాలలో బుక్ అయాడు. ఈ తార పుట్టిన పండగ రెసిడెన్సీలో. పాత్రి కేయుల సమక్షంలో కేక్ కట్ చేసిన ఈ చిరంజీవి, తల్లికి మల్లేనే లేత వయస్సులోనే స్టార్‌డమ్ అందు కున్నాడు. మాస్టర్ తరుణ్‌కి మా శుభాకాంక్షలు.... పిఆర్ఓ : అర్జున రావు.

. . . . . 09

చందమామ రామారావుని పది హేను రోజుల క్రితం చూశాము - సుస్తీగా వున్నారని తెలిసి! నీరసంగా మంచంమీద పరుండి వున్నప్పటికీ చూడటానికి వచ్చిన నలుగురిని - మేమిద్దరం, రాధా శివస్వామి, శారదాంబ - గుర్తుపట్టారు; కుశల ప్రశ్నలు అడిగారు. కాని, శారీరకంగా, మానసికంగా కుంగిపోయినట్లు తోచింది.... గత నలభై ఏళ్లలో రామారావుగారు మాకు ఎందరినో పరిచయం చేశారు; అందులో కొందరు

మాకు అతి సన్నిహితులయారు.... ఎవరికెటువంటి కష్టం వచ్చినా అదు కొనే మనిషి, ఎన్నో కుటుంబాలకు పెద్ద దిక్కువంటి ఉత్తముడు, ఎందరో స్నేహితుల గుండెల్లో గానమై నిలిచిన దయాంతరంగుడు, ఇలలోని 'చందమామ'ని వొదిలి, దివి లోని 'చందమామ'ని కలుసుకొనేం దుకు చుక్కల్లోకి వెళ్లిపోయారు.... రామానంద చటర్జీ 'మాడరన్ రెవ్యూ' తో కలకత్తాలో జర్నలిజమ్ ప్రారం భించిన బియస్ రామారావుకు, నేటి పరిస్థితుల నైరాశ్యత కలిగించడంలో ఆశ్చర్యం లేదు. కాని, 'మార్పు కాల స్వభావం. కొందరు ఆ మార్పుని చిరుహాసంతో తీసుకోగలరు; మరి కొందరు మనోవేదనకు లోనవుతారు. రెండవ కోవకు చెందిన వ్యక్తి పాలెపు రామన్న (బియస్ రామారావు కలం పేరు). హాస్యపు చిందులు వెదజల్లుతూ మాట్లాడే రామారావు యికలేరు. కొల్హాపూర్ 'ధర్మపత్ని' నుంచి, నిన్న మొన్నటిదాకా తెలుగు సినీ చరిత్ర లోతుపాతులు తెలిసిన ఏకైక వ్యక్తి చందమామ రామారావు. సినీ చరిత్రే కాదు, తెలుగు జర్నలిజమ్ కూడా! ఎన్నో తెలిసిన వ్యక్తి, ఎందరికో దారి చూపిన వ్యక్తి, తన దారిని తను వెళ్లిపోయారు - రామపాదం చేరు కునేందుకు! వారి కుటుంబానికి మా సానుభూతి తెలియబరుస్తూ, ఆయన ఆత్మకు శాంతి కలుగు గాక! - అని కోరుకుంటున్నాము.

..... 17

ఉదయం కోరమండల్‌లో కల కత్తాకు. కలకత్తాలో బేలూరుమఠ్ దక్షిణేశ్వర్ 18వ తేదీన. 19, 20- దుర్గాపూర్, శాంతినికేతన్, 21 ఉదయం 'ప్రాజెక్ట్ టైగర్'లో సుందర బన్స్; ఆ రాత్రి, 24 పరణాలలోని పఖిరాలయా గెస్ట్‌హవుజ్; మర్నాడు మధ్యాహ్నం మూడున్నరకి కలకత్తా; 23వ తేదీన విక్టోరియా మెమోరియల్, రవీంద్రుని నివాస గృహం; ఆ రాత్రి మెయిల్‌లో మద్రాసుకి; 25 ఉదయం సెంట్రల్.... శివస్వామి దంపతులతో ఈ టూర్ విశేషాలన్నీ తర్వాత.

..... 25

ఈ సాయింత్రం వాసిరెడ్డి సీతా దేవి 'యల్వీఆర్' అవార్డు ఫంక్షన్ అవడం వల్ల, 'మాయాపూర్ ట్రిప్' కాన్సిల్ చేసుకు, ఉదయానికి వచ్చే శాము. కలైవానార్‌లో 'యల్వీఆర్' ఫౌండేషన్ బహుమతి ప్రదానోత్సవ సభకు తమిళనాడు గవర్నరు భీష్మ నారాయణ సింగ్ ముఖ్య అతిథి; తమిళనాడు న్యాయశాఖా మంత్రి కృష్ణస్వామి సభాధ్యక్షులు. బహుమతి గ్రహీతలు: వాసిరెడ్డి సీతాదేవి; సరోజినీ వరదప్పన్; ఫిజికల్ ఎడ్యు కేషన్ ప్రొఫెసర్ సుబ్బు (పిఆర్ సుబ్రమణియన్) - ఒకొక్కరికి పదేసి వేలు - మొత్తం ముప్ఫయి.... ఆ తర్వాత పదకొండు విద్యాసంస్థలలోని బాల బాలికలకు స్టీలు పళ్లాలు,

గ్లాసులు ; గెలుపొందిన క్రికెట్ టీమ్‌కి యల్వీఆర్ ట్రాఫీ.... 'ప్రగతి శీలక సాహిత్యానికి అంకితమైన వ్యక్తి వాసి రెడ్డి సీతాదేవి.... స్త్రీల సంస్థలద్వారా సామాజికోన్నతికి పాటుపడుతున్న సేవా పరాయణి సరోజినీ వరదప్పన్ .... దేహాన్ని మనసుని తులామానం లో ఉంచే వ్యాయామ బోధకుడు సుబ్రమణి' - అన్నారు యమ్‌జిఆర్ మెడికల్ యూనివర్సిటీ వైస్‌ఛాన్స్‌లర్ లలితా కామేశ్వరన్.... 'తిరుపతిలోని నిత్యాన్నదాన పథకానికి యల్వి రామయ్య ప్రారంభంలో పది లక్షలు విరాళమిచ్చారు. బొంబయి నుంచి మరొక యిద్దరు దాతలు చెరో పది లక్షల చొప్పున యిచ్చారు. ఈ ముప్ఫయికి, దేవస్థానం వారి మరొక ముప్ఫయి జోడించి ఈ పథకం ప్రారంభించాము. ఇప్పటికి యల్వీఆర్ ఛారిటీస్ నుంచి 80 లక్షలు ముట్టింది; యితర దాతలతో కలిపి మొత్తం అరుకోట్లయింది; దేవస్థానం వారి ఆరుకోట్లతో, మొత్తం పన్నెండు కోట్ల మూలధనంతో ఈ నిరతాన్నదాన పథకం సాగుతోంది. రామయ్యగారు 30 వేలు చేసే మొక్కలు బయట దేశాల నుంచి తెప్పించారు ; తోటలు పెంచడం వల్ల సాలీనా రెండుకోట్లు ద్రాక్షకయే వ్యయం మిగులుతోంది' - అన్నారు ఈ ఫౌండేషన్ పర్మనెంట్ ఛెయిర్‌మాన్ జస్టిస్ చల్లా కొండయ్య. బహుమతి గ్రహీతలు సముచిత రీతిని సమాధానం చెప్పారు. ఈ సంద ర్భంగా, జస్టిస్ లక్ష్మణన్, మద్రాసు యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ సతీష్, అడ్వకేట్ గాంధీ ప్రసంగించారు. యల్వి రామయ్య స్వాగతం తెలిపారు. కుమార్ సుదర్శన్‌ల వయొలిన్‌తో సభా కార్యక్రమం ప్రారంభమయింది.

..... 27

టి నగర్ వెంకటేశ్వర కళ్యాణ మండపంలో కవిరాజు స్మృత్యంజలి (త్రిపురనేని రామస్వామి వాదరి) ముఖ్యవక్త రావిపూడి వెంకటాద్రి కారణాంతరాలవల్ల రాలేకపోయారు. శ్రీకాంత్ స్వాగతం తెలిపిన తరువాత, సభాధ్యక్షులు రామచంద్ర, 'తమిళ నాడులో పెరియార్‌ది రాజకీయ ప్రచా రం ; ఆంధ్రాలో త్రిపురనేని వారిది సారస్వత ప్రచారం. పాల్కురికి సోమ నాధుడు కూడా అటువంటి ప్రచారం చేసినవాడే' - అన్నారు.... 'వైదిక మత పునరుద్ధరణకు సాహిత్యోద్యమం నన్నయ కాలంలోనే ప్రారంభ మయింది. తిక్కన, వేమన, కందు కూరి, గురజాడ, రాయప్రోలు - వీరందరూ ఉద్యమ కారులే! ఘర్షణ నుంచి ఉద్యమం జనిస్తుంది. త్రిపుర నేని వారిది హేతునిబద్ధ సాహిత్యోద్య మం - ప్రాచీన పాత్రలకు పేరడీలు వ్రాశారు. తెలిసిన విషయాల ద్వారా - అనే ప్రక్రియ వారు చేబట్టారు. తిరుపతి వెంకటకవుల కాలమవడం వల్ల ఛందోబద్ధమగు కవిత చేబట్టారు. జాషువా విషయం కూడా అంతే! సమకాలీన పండిత మండలి దృష్టిలో పడాలి - వారిని మెప్పించాలి....

మతం అంటే ఏమిటి ? ఒక నమ్మకం. మన నమ్మకం, పొరుగువాని నమ్మకం తో పేచీ పడకుండా వుండటమే సమైక్యతా సాధన .... కులాలనేవి వృత్తిపరంగా ఏర్పడ్డాయి. ఎగుడు దిగుళ్లను అర్ధం చేసుకు, తనకి తా ను గా అన్వయించుకోవడం ద్వారానే మానసిక వికాసం పొందు తున్నాడు సామాన్య మానవుడు. కవి రాజుగారి కుప్పుస్వామి శతకం సమాజ స్వరూపాన్ని చక్కగా తెలుపు తుంది' – అన్నారు కృష్ణమూర్తి. లక్ష్మీ రఘురామయ్య ప్రసంగం తర్వాత సుబ్బయ్య వందన సమర్పణ.

. . . . . 30

అమర గాయకరత్న ఘంటసాలకు కళాసాగర్ వారి సంగీత సంస్మరణ మ్యూజిక్ అకాడమిలో. హరనాధ రావు, ఎవి సుబ్రహ్మణ్యం సుమధుర కోమల పదబంధ పారిజాతంతో సంగీతోత్సవ స్వరగతులు శ్రోతలకు పరిచయం చేయగా, ఆనంద్ ఆర్కె స్ట్రాలో లీలా, జిక్కి, మాధవ పెద్ది సత్యం, వసంత, రామకృష్ణ, ఆనంద్, వందేమాతరం శ్రీనివాస్, శివప్రసాద్, మోహనదాస్, నాగూర్‌బాబు, అందమె ఆనందం, చిగురాకులలో చిలకమ్మ, రాజశేఖరా నీపై మోజు తీరలేదురా, ఊహలు గుస గుసలాడె, నీ కొండకు నీవే రప్పించుకో, వివాహ భోజనంబు వంటివి అనార్కలి, బ్రతుకు తెరువు, మాయాబజార్ మున్నగు అనేక చిత్రాలలోనివి పాడారు. కళామతల్లి ఆశీర్వాదంతో, సినీ లోకాన పాతికేళ్ళ ప్రిన్స్ అయిన బాలుకి కళాసాగర్ సత్కార సందర్భంగా, ఈ సంగీత విభావరి. యస్ జానకి, ఘంటసాల శ్రీమతి సావిత్రిని తనవెంట వేదిక మీదకు తీసుక వెళ్ళి, దీపారాధన గావించి, ఆయన చిత్రపటానికి పుష్ప మాల వేశాక, భగవద్గీత కాసెట్‌లోని మూడుశ్లోకాలతో మ్యూజికల్ నైట్ ప్రారంభమయింది. గీ తా ప ఠ నం తర్వాత మహాకవి కాళిదాసు చిత్రం లోని శ్యామలా దండకం. ఆతర్వాత మిగతా గానలహరి. .. ఎనిమిది గంట లకు బాలసుబ్రహ్మణ్యం ఘంటసాలతో తను పాడినదీ, కోదండపాణి సంగీత దర్శకత్వంలో పాడిన మొదటి ప్లేబాక్ పాడి, శ్రోతలను ఆనందింప జేశారు.... అప్పటికే ఎనిమిదిన్నర అవడం వల్ల సత్కార కార్యక్రమం చూడగల అవ కాశం లేకపోయింది.

—యన్నార్ చందూర్



మహాయుద్ధానంతరం ఏ దేశాని కైనా మిగిలేది మూడు రకాల సేన : అంగవికలుల సేన, దుఃఖితుల సేన, దొంగల సేన. —జర్మన్ సామెత

మన కర్తవ్యపు బాటపై పన్నీరు చిలకరించరు - గులాబీలు వికసించవు.

— తిలక్

అదృష్టమనేది పొందదగు బహు మతి. సాహసం దానికి బాట. అవకాశం రోడ్డు పక్కన నక్కి వుండే నీడ.

—ఓ హెన్రీ



# కొత్త పుస్తకాలు

మూడు నగరాలు - ట్రావెలాగ్. రచన ; దాసరి అమరేంద్ర. కాపీలకు : C - 20 BEL Colony, Chandra Nagar, Ghaziabad – 201 011.... విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435 విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు – 1. వెల : రు 10-00.

“నూట ముప్పయి సంవత్సరాల క్రితం ఏనుగుల వీరాస్వామిగారు తమ 'కాశీయాత్ర'తో శ్రీకారం చుట్టినా, అడపాదడపా కాశ్మీర దీపకళిక లాంటి నాయనివారి వసివాయని రసగుళికలు తళుక్కున మెరిసినా, తెలుగులో ట్రావెలాగ్ పుస్తకాలు అత్యంత అరుదు.... ఆరంటే ఆరే రోజుల్లో అచ్చేసి యిచ్చారు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ శ్రీనివాస్‌గారు. 'ఇల్లు కట్టిమాడు – బుక్కు వేసిమాడు' రోజుల్లో, 'నేను సైతం తెలుగు తల్లికి పొత్త మొక్కటి సమర్పించా' ” – అంటున్నారు దాసరి అమరేంద్ర.... నంబూరి అన్నపూర్ణ, తమ్ముని భార్య పద్మ, పద్మ అన్నగారు హనుమంత రావు – ఈ ముగ్గురి ప్రోత్సాహంతో 'వ్రాత ప్రతి' వెలుగు చూసింది ; పది మందిలోకి వచ్చింది.

భారత్ ఎలక్ట్రానిక్స్‌లో పని చేస్తున్న అమరేంద్రని, ఉద్యోగరీత్యా కంపెనీ వారు, 1989 అక్టోబరు ఒకటో తేదీన వారం పది రోజుల ట్రిప్‌గా జర్మనీ ఫ్రాన్సులు పంపారు – ముఖ్యంగా మ్యూనిక్ నగరంలోని 'సీమెన్స్'కి! సీమెన్స్‌గాక మరికొన్ని కంపెనీలతో కూడా భారత్ ఎలక్ట్రానిక్స్‌కి వ్యాపార సంబంధమగు లావాదేవీలు వున్నాయి.

ఇందిరాగాంధీ ఇంటర్నేషనల్‌లో (ఢిల్లీ) ఉదయం తొమ్మిది గంటలకు ఎక్కిన ఫ్లయిట్, థార్ ఎడారి, సింధు నదీల మీదుగా, పశ్చిమాసియాలోని నిర్జీవ పర్వత శ్రేణులూ, మధ్య ధరా సముద్రం దాటి, రోమ్ నగరం చేరుకొనేసరికి మధ్యాహ్నం రెండవుతుంది. అక్కడ నుంచి ఫ్రాంక్ ఫర్ట్, ఆ తర్వాత మ్యూనిక్. అక్కడి టైము రాత్రి ఎనిమిదే అయినా, మొత్తం పదిహేను గంటల ప్రయాణం. ఆల్ప్స్ పర్వత పాదాల వద్దనున్న మ్యూనిక్, పశ్చిమ జర్మనీలోని మూడవ పెద్ద నగరం - బవేరియా రాష్ట్రానికి ప్రధానపట్నం. కంపెనీ పనులతో బాటు ప్రకృతి సోయగాలు, ప్రాచీన కట్టడాలు పరికిస్తూ పర్యటించిన అమ

రేంద్ర, మంచుకొండల సౌందర్య దీప్తులకు విస్మయులవుతూ హిమాలయాలకు, వాటికి గల సారూప్యం వీక్షించబోతారు. అక్కడ వేల సంఖ్యలో కార్లు వున్నప్పటికీ కారు హారన్ వినిపించదు - ధ్వని కాలుష్యం ఏర్పడ కుండా వారి కంత శ్రద్ధ.

జర్మన్ టెలివిజన్ కన్సర్వేటివ్ అయితే, ఫ్రెంచి టెలివిజన్ దేహాలాలసకు వన్నె చిన్నెలు సమకూరుస్తుంది. పారిస్‌లోను, ఫ్రాన్సులోను పాండిచ్చేరి కనిపిస్తుంది. యానాం తెలుగు వారు సలాది విజయభాస్కరరావు, కమల మోహనూ, తమిళనాడుకి చెందిన 'అంజె' అక్కడ తటస్థపడతారు. 'అంజె' కుటుంబం లోని వారికి తమిళం, ఫ్రెంచి తప్ప మరొకభాష రాదు.

లండన్ చూసి రావటం ప్రయివేట్ ట్రిప్. పారిస్ నుంచి భూమార్గాన వెళ్లడమంటే, ఒక పగలుగాని ఒక రాత్రిగాని పడుతుంది. సైట్ సీయింగ్ బస్సులో కూచునే, బర్కిలి స్క్వేర్ పికడల్లీ, ట్రఫాల్గర్, బిగ్‌బెన్, 10 డౌనింగ్ స్ట్రీట్, బకింగ్ హామ్ పాలెస్, క్లియోపాత్రాస్ నీడిల్ మున్నగునవి చూస్తారు. ఆక్స్‌ఫర్డ్ వీధి ఆబిడ్స్‌ని గుర్తు చేసిందట. మేడమ్ టుసాడ్స్ మ్యూజియమ్‌లోని ప్రఖ్యాత వ్యక్తుల మైనపు బొమ్మలు - ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీలతో సహా - జీవకళ వుట్టిపడుతూ చూపరులను ఆశ్చర్యాంబుధిలో ముంచుతాయుట.

ఒకటో తేదీ ఉదయం బయలుదేరి, తెల్లారితే పదకొండనగా రాత్రి ఒంటిగంటన్నరకి ఢిల్లీ విమానా శ్రయంలో ముగిసిన ఈ ట్రావెలాగ్, పాఠకుని రచయిత వెంట ఆయా ప్రదేశాలకు పట్టుకుపోతుంది. లోగడ వాసా ప్రభావతి తమ మాస్కో ప్రయాణం గురించి కూడా ఈ విధంగానే వ్రాశారు. మ్యూనిక్, పారిస్, లండన్ నగర వీధులలోకి, ఆ ప్రజల మధ్యకి పాఠకుని తీసుకు వెళ్తారు దాసరి అమరేంద్ర - చక్కటి రచనా కౌశలంతో.

—క్షీరసాగరమ్

గేయవల్లరి - కవితలు, రచన; గోపరాజు హైమవతి, 6వ లైను, రాజేంద్ర నగరం గుడివాడ - 521301. వెల: రు. 20-00.

ఇందులో చిన్నవీ పెద్దవీ చాలా గేయాలు వున్నాయి. యివి - పక్షులు, ఫలజాతులు, పువ్వులు. కీటకాలు - జంతువులు - బాలలు, దేశము, సంఘము, గృహము, యిలా వేర్వేరు అంశాలకు చెందినవి. సంసార సాగరం సుఖం గేయంలో :- 'ధన ముంటె దాచుటె దుఃఖం - సంతుంటె సాకుటె కష్టం - ఈ రెండూ పేరుకుపోతే ఎంతో ఎంతో కష్ట నష్టం' - అంటూ గల్ఫ్ యుద్ధం కొచ్చేసరికి - 'యుద్ధ జ్వాల సద్దాం హేల.... ... బుష్ హైటెక్ విజయం - పుష్ బటన్ వార్ ఫేర్.... ఈ అధునాత యుద్ధం అంతిమ యుద్ధం కావాలి. విశ్వశాంతి వర్థిల్లాలి— అని కోరుకుంటారు కవ

యిత్రి. టె ్ర ర రి జం. గేయంలో హితవుతో పాటు ఆవేదనా వాక్యం వుంది.... న్యూక్లియర్ యుద్ధంలో : మానవుడా – ఓ దాన వుడా అంటూ హె చ్చ రి క.... కవయిత్రిలోని ఆవేదన, ఆనందం, తృప్తి, హితవు - ఈలా ఎన్నెన్నో వ్యక్తం చేశారు - ఈ గేయాల్లో సరళం గానూ - సహజంగా. చదువుకోవడా నికి బావుంది.

—అన్నపూర్ణా రెడ్డి

రాధిక ప్రణయం – గోపికా హృదయం. రచన : గొల్లకోట దీక్షి తులు, పిఠాపురం. అన్నగారిపై అను రాగంతో జయంతి బాలా త్రిపుర సుందరి, ఈరంకి కుసుమ ఈ చిన్న పుస్తకాలు ప్రచురించారు.

ప్రకృతికి ప్రతీక రాధ; పర బ్రహ్మమునకు ప్రతీక కృష్ణుడు - అం టారు పరిచయ వాక్యాలు రాస్తూ, శాంతి ఆశ్రమం రాపర్తి రామారావు. నిరాకారం నుంచి ఓంకారం జనించింది. జయదేవులు, లీలాశుకులు, నారాయణ తీర్థులు, సూరదాసు వంటివారు రాధా కృష్ణుల ప్రణయాన్ని గానం చేశారు. ....రాధ నందునికి వేలు విడిచిన సోదరి - అంటే కృష్ణునికి మేనత్త.... కృష్ణుని చూశాక రాధ మళ్ళీ తండ్రి యింటికి వెళ్లదు ; నందుని వద్దనే వుండిపోయి కృష్ణుని గాఢంగా ప్రేమిస్తుంది. అక్రూరుడు బలరామ కృష్ణులను తీసుకు వెళ్లేనాటికీ రాధ, కృష్ణుని హృదయంలో శాశ్వత స్థానం పొందుతుంది.... వియోగాగ్ని లోనైన రాధ కోసం నందుడు బృందావనంలో ఒక కుటీరం నిర్మింపజేస్తాడు. మురళి తన పెద వుల్ని తాకగానే, కృష్ణునికి జ్ఞాపక మొచ్చేది రాధే ! భార్యలలో మాత్స ర్యం ఉంది ; కాని, రాధది నిర్మల మైన ప్రేమ. రాధా కృష్ణులని విడ దీయలేము - అంటాడు అయిదు వందల ఏళ్లక్రితం జన్మించిన గౌరాం గుడు.

గోపికా హృదయంలోని ప్రేమ అయిదు విధాలు : శాంత, సఖ్య, దాస్య, వాత్సల్య, మధుర.... మహ ర్షులకు దేవుడు శాంతమూర్తి ; అర్జును నికి కృష్ణుడు సఖుడు ; సీతారాములకు ఆంజనేయస్వామి దాసుడు ; యశోధకు తన కొడుకు వాత్సల్య సింధువు ; ఆత్మేశునిగా ఆరాధించే మధురప్రేమ గోపికలది, రాధది. గోపికాహృదయం తేజోవిరాజితమే తప్ప ప్రపంచ వాసనలు అంటవు.... ప్రేమ భావం ఎంత నిత్యనూతనమో, 'రాధా-కృష్ణ' ప్రణయం కూడా అంతే !

—సుమతీ సాగర్

సామాన్యమైన స్త్రీలకే ప్రేమంటే ఏమిటో తెలుస్తుంది - అందమైన స్త్రీల జీవితం ఆకర్షణల మధ్య గడుస్తుంది. —హెప్‌బర్న్

ప్రేమ లేకుండా పెళ్లి వున్నప్పుడు, పెళ్లి లేకుండా ప్రేమ ఎందుకుండ కూడదు ? ....ఫ్రాంక్లిన్

# సమీక్షలు

**చిత్రజగతి**

## రాజీవ్ రత్నావారి
## 'రక్త తర్పణం'

దుర్గగుడి మెట్ల మీద ఒక పెద్దాయన (సత్యనారాయణ), కానిస్టేబుల్ (ప్రభాకర రెడ్డి) కొడుకుని అవమానించగా, ఆ బాలుడు శ్రద్ధగా చదువుకు, సుశిక్షణతో వృద్ధిలోకి వచ్చి, ఇనస్పెక్టర్ రవీంద్ర (కృష్ణ) అవుతాడు. ధర్మం కోసం, న్యాయం కోసం ప్రాణాలివ్వడానికైనా సిద్ధపడే ఈ పోలీసు అధికారికి, రాజకీయ నాయకులు తమ పదవుల కోసం; తమ అక్రమార్జన కోసం సంఘ విద్రోహ శక్తులైన గూండాలని ఎలా పెంచి పోషిస్తున్నదీ, చట్టానికి దొరకకుండా ఎలా కాపాడుతున్నదీ క్షుణ్ణంగా తెలుసు. అయితే, తమ పోలీసు శాఖలోనే, పై అధికారులు, ఆ నీచులతో చేతులు కలుపుతున్నారని అనుభవంలోకి వచ్చి బాధపడతాడు. కాని, తన ధర్మయుద్ధం మాత్రం ఆపడు. మట్టిలో మాణిక్యంలా ఒకే ఒక్క సీనియర్ ఆఫీసరు (బాలయ్య) రవీంద్ర నిజాయితీని గుర్తించి, తండ్రికి దగ్గరగా ఉంటాడని స్వంత ఊరుకి ట్రాన్స్‌ఫర్ చేస్తాడు. (అటువంటి ట్రాన్సఫర్లు సినిమాల్లోనే జరుగుతాయి). మొదట చెప్పిన పెద్దాయన కూతురు (నూతన నటి - వర్ష) అప్పుడే అమెరికా నుంచి వచ్చి, జోళ్లు విడవకుండా అమ్మవారి చేరువకు రాబోతూవుండగా, ఇనస్పెక్టర్ రవీంద్ర నిరోధిస్తాడు. పవిత్ర హిందూ సంప్రదాయానికి విరుద్ధంగా ప్రవర్తించ నీయనంటాడు. గత్యంతరం లేక హీరోయిన్, చెప్పులు వొదిలి అమ్మవారి వద్దకు వస్తుంది గాని రవీంద్రపై పగబడుతుంది. 20 వేల రూపాయిల బంగారు గొలుసు పోయిందని అబద్ధపు కేసు పెట్టి, దొంగని పట్టుకొనే భారం రవీంద్రపై మోపుతుంది. చిటికలో ఈ సమస్యని అతను పరిష్కరించేసరికి, వెంటనే హృదయం యిచ్చేస్తుంది. ఈ ప్రేమ వ్యవహారమూ, రసరాగ రంజిత శృంగార విహారమూ అలా వుండగా డ్రామాలో సీత వేషం వేయనున్న రవీంద్ర చెల్లెల్ని, హీరోయిన్ అన్నగారు మోసపుచ్చి, నిర్జన ప్రదేశంలోకి తీసుకు వెళ్లి 'రేప్' చేస్తాడు. తత్ఫలితంగా ఆమె చనిపోక తప్పదు కదా! అక్కడితో 'బాటిల్ లైన్స్' తేలిపోతాయి. సీనియరాఫీసరు ఒక్కడు తప్ప

మిగతా పోలీసు వుద్యోగులు, పెద్దా యన, మినిస్టరు (కోట శ్రీనివాసరావు) ఒక పక్షం; రవీంద్ర, మనసిచ్చిన హీరోయిన్, మాస్టర్ అనే కుక్క ఒక పక్షం. తండ్రిని, చెల్లెల్ని చంపిన వారి పచ్చి నెత్తురు ఖడ్గంతో చిందించి, రక్తతర్పణ మర్పించిన హీరో చేతులకి బేడీలు పడతాయి.... సంగీతం : బప్పీలహరి. దర్శకత్వం : కృష్ణ. నిర్మాత : జి నరసింహారావు ....పి ఆర్ ఒ : బిఎ రాజు.

## వేషవల్ వారి

## 'మృగ కృష్ణ'

కృష్ణ ప్రసాద్ (శరత్‌బాబు), తమ ఆఫీసులో పని చేస్తున్న సునం దని (రేవతి) రూమ్‌కి పిలిచి, అమాం త్రం ప్రొపోజ్ చేసేసరికి - డిక్టేషన్ తీసుకుందామని వచ్చిన యువతి ఈ డిక్లరేషన్‌కి - ఆశ్చర్య చకితు రాలవుతుంది; నోట మాటరాదు. 'వెంటనే చెప్పక్కర్లేదు; నేను ఆరు నెలలు మ థ న ప డి మనో భావం వెల్లడించాను; నీవు కనీసం ఆరు రోజులైనా తీసుకోవాలి నీ నిర్ణ యం తెలిపేందుకు! నీవు అవునన్నా, కాదన్నా నాకు నీ పట్ల గల ఆదరా భిమానాలలో వీసమంత కూడా మార్పు వుండదని హామీ యిస్తు న్నాను' - అని అంత గౌరవంగా, మర్యాదగా, నాగరికంగా, గంభీరంగా 'బాస్' చెబుతున్నప్పుడు, జీతం రాళ్ల మీద ఆధారపడ్డ ఏ తరుణి కాదన గలదు? లేమి, ఒంటరితనం, నిరు ద్యోగం ఈ మూడు పెద్ద పులుల నుంచి బయట పడగల అదృష్టం, కాళ్ల దగ్గిర కొచ్చి వాలినప్పుడు, మనసులో మరొకరు వున్నప్పటికీ, ఈ భౌతిక సుఖాలు వొదులు కుంటుందా? కారు, బంగాళా, తడుముకో నవసరం లేకుండా డబ్బు కావాలని ఎవరికుండదు? అవి అయాచితంగా వస్తున్నప్పుడు ఎండ మావుల వంటి ప్రేమని నమ్ముకు, వాటిని తృణీకరించడం వివేక వంతమా? రవీంద్రను తను ప్రేమించిన మాట నిజమే! అతనికి తన పట్ల అను రాగం వుండటమూ నిజమే. నందన వనం రారమ్మని పిలుస్తున్నప్పుడు ఈ యిరుకు బతుకు దేనికి? బాస్‌కి చెప్పి రవీంద్రకు మంచి ఉద్యోగం యిప్పించవచ్చు. 'నేను ఒంటరివాణ్ణి - పెళ్లికి పిలిచేందుకు నీ తరఫున ఎవరైనా వున్నారా?' - అని కృష్ణ ప్రసాద్ అడిగినప్పుడు, 'ఇద్దరే - ఒకరు నా రూమ్ మేటు; మరొకరు కాలేజీ మేట్' అంటుంది.... వర్కింగ్ గర్ల్స్ హాస్టల్లో, ఈమెతో రూమ్ షేర్ చేస్తున్న ఫ్రెండు,.... 'ఐశ్వర్యం ఆశించి రవీంద్రని నీవు ఆవిధంగా వదిలేయడం క్షంతవ్యం కాదు. హృదయ ధనాన్ని మించిన సంపద ఈ లోకంలో లేదు. నీవు తప్పు దారి తొక్కుతున్నావ్' - అని వారిస్తుంది. కాని, సునంద వినదు. తిరుపతిలో పెళ్లి చేసుకునేందుకు కృష్ణ ప్రసాద్‌తో కారులో బయలుదేరుతుంది. కాగా,

రవీంద్ర రూపం, ఆ స్మృతులూ ఆమెని వెంటాడుతాయి. మనస్సంక్షోభమూ, జ్వరమూ, కలవరింతలతో వారం రోజులు హాస్పటల్‌లో వున్న సునంద అంతర్యం గ్రహించి ఆమెని హాస్టల్ వద్ద దిగబెడతాడుకృష్ణ ప్రసాద్. సరిగ్గా అదేసమయానికి, అమె రూమ్‌మేటు, రవీంద్ర పెళ్లి దండలతో మెట్లు దిగుతూంటారు. నక్కిదాక్కున్న సునందకు యిటు ప్రేమా, అటు సంపదా - రెండూ ఎండ మావులవుతాయి.... వాసిరెడ్డి సీతాదేవి నవల ఆధారంగా దర్శక నిర్మాత పి. సాంబశివరావు నిర్మించిన ఈ చిత్రం, మనం చూసే సర్వసాధారణ తెలుగు చిత్రాలకు ఎన్నో మెట్లు పైన ఉంది. బేలహృదయిని సునందగా రేవతి ఎంతో గొప్పగా యాక్ట్ చేసింది. ఆ రూపం కనీసం రెండు రోజులపాటు 'హాంట్' చేస్తుంది. ఈ పిక్చర్ తయారై సంవత్సరన్నర అవుతుంది. అంతార్జాతీయ చలన చిత్రోత్సవ సందర్భంగా, పోయిన సంవత్సరం మద్రాసులోను, ఈ సంవత్సరం బెంగుళూరులోను ప్రదర్శింబారు తప్పితే, తెలుగు ప్రేక్షక లోకంలోకి యింకా వెళ్లలేదు. ప్రద



## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు- మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ........................................................

అడ్రసు ........................................................

........................................................

........................................................

తేదీ : సంతకం

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004



ర్శన రంగంలో మార్పు ఏర్పడితే గాని, యిటువంటి మంచి చిత్రాలకు వెలుగు చూసే అవకాశం లభించదు.

జెయస్‌కె వారి

## 'అదృష్టం'

హైదరాబాదు బిర్లా మందిర్‌లో బాంబు పెట్టనున్నారని, గోడలకుండే చెవుల ద్వారా విన్న హీరో (నరేష్) పోలీసు స్టేషన్‌కెళ్లి నానాహంగామా చేసి, చివరికి మేజస్ట్రేట్ కోర్టులో తేల్తాడు. మతిస్థిమితం లేని వ్యక్తిగా యితనిని బయట పడేస్తాడు తెలివిగల పీడరు.... ఆఫీసులోని గుండు గోవిందమూ, యితనూ చిన్ననాటి స్నేహితులు. రయిల్వే ట్రాక్ మీద దుండగులు పెట్టిన బాంబుని మొదట చూసినదీ రైలు ఆపినదీ తనే అయినప్పటికీ, తీరా రయిల్వే ఉద్యోగులు ప్రమాద స్థలానికి వచ్చేటప్పటికి, తను మూడడుగులు వెనకేయటం, గుండు గోవిందం ముందుకి రావడముతో ఈ వీరోచిత కార్యం అతనిదే అనుకుంటారు పై అధికారులు, అతనికే ప్రెసిడెంట్ మెడల్ వస్తుంది; స్కాలర్ షిప్ వస్తుంది; ఎమ్‌ఎ పాసవుతాడు; ఎమ్‌బిఎ పూర్తి చేస్తాడు; కంపెనీ మేనేజరవుతాడు. తను అదే కంపెనీలో క్లర్కుగా, నిత్య దారిద్ర్యంలో రోజులు వెళ్లదీస్తున్నాడు; హెడ్ కానిస్టేబుల్‌గా తండ్రి (పియల్ నారాయణ) రిటైరయాడు; తల్లికి కాటరాక్టు; మేనమామ, మేనమామ కూతురు (యమున) తమతో బాటే తమ యింట్లో వుండి కలో గంజో తాగి, కాలక్షేపం చేస్తున్నారు. పేదరికం, ప్రేమ బంధాలని పెంచే గృహ వాతావరణమది. మరదలు ఈ బావని వలేసి పట్టుకొనేందుకు శతవిధాల ప్రయత్నిస్తూ వుంటుంది. ప్రాపంచిక బాధలు భరించలేక బార్‌లోకి వెళ్లిన హీరోని, బార్‌మాన్ (సత్యనారాయణ) రూపంలో అదృష్టం వరిస్తుంది. 'విశ్రాంతి' తర్వాత కనిపించేది స్వప్నానుభూతి అయినప్పటికీ, బాస్ (వేలు) కూతురు (ఐశ్వర్య) హీరోను ప్రేమిస్తుంది; పెళ్లి చేసుకుంటుంది; నెల తప్పగా అబార్షన్ చేయించుకుంటుంది; ఫెమినిజమ్ మాట్లాడుతుంది; నా దేహం, నా యిష్టం - అంటుంది; కార్మిక నాయకుడు (శుభలేఖ సుధాకర్) కోరినవన్నీ అంగీకరిస్తాడు హీరో; చివరికొక రోజున 'అదృష్టం' రిక్షా మనిషి రూపంలో బోల్తాకొట్టిస్తుంది. మౌళి దర్శకత్వం వహించిన ఈ చిత్రంలోని ప్రత్యేకత ఏమిటంటే, స్వప్న జాగ్రదా వస్థలను ఏక తాటి మీద నడిపించి, మనకి కూడా కల నిజమనే భ్రమ కలిగిస్తారు. నరేష్ మనని స్వప్న సీమలో విహరింప జేసి, మానవతా విలువలు గల మామూలు ప్రపంచంలోకి మళ్లీ పట్టుకొస్తాడు. నిర్మాత : నిథిన్ కపూర్ : సమర్పణ : జయసుధ.... పిఆర్‌ఓ : జగన్.

సంక్షిప్త భాగాలు

# 'నా రాష్ట్ర చక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమైన 'వ్యక్తి సత్యాగ్రహానికి' ప్రప్రథములుగా ఆయన వినోబా భావెని ఎన్నుకున్నారు ; జవహర్‌లాల్ నెహ్రూ రెండవవారు. 'జాతి పిత'గా దేశం గాంధీజీని గౌరవించి, సర్వోదయ సిద్ధాంతానికి కాస్త ఊపిరి నిచ్చిందే గాని, గాంధేయ పథం విస్మృతి పథాన పడింది.... రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయడు గారొకరు.... వారి జీవిత గాధలోని సంక్షిప్త భాగాలివి.

గాంధీ సత్యశోధనకు అంతమొందని విలువలున్నాయి. అతడు ప్రత్యక్ష బుద్ధావతారుడు. శ్రీ ఆది శంకరుల 'బ్రహ్మసత్యం, జగన్మిథ్యం' ప్రవచనానికి ఇదే నికరమైన అర్థం. 'Before Abraham was, I am' అన్న క్రీస్తు నిత్యసత్యానికి తిరుగులేదు. స్థల కాల భేదాలు లేకుండ, బ్రహ్మజ్ఞానులందరిదీ బ్రహ్మలోనే నిత్యనివాసం. గాంధీ జాతీయ పాఠశాలను గూర్చి మరికొన్ని మాటలు.

తోట నిండా బత్తాయి చెట్లు ; మోటతో నీరు తోడటానికి ఒక పనివాడు ; బోదెలు చేసి చెట్లకు నీరు పెట్టటం ; దోమపోటు తగలకుండ పరువుకు వచ్చిన రంగు దేరిన కాయలకు బుట్టలు కట్టటం ; కాయలకోత, వాటి నిలవ, అమ్మకం ; గడపారల, పారల, తొళ్ళికలతో తోటలోని ఖాళీ ప్రదేశాలను అద్దం లాగున శుభ్రపరచి, మళ్లుకట్టి, గుమ్మడి, సొర, కాకర, టమేటాలతో సహా కూరగాయల పెంపకం ; అమ్మ

కొనే వాళ్ళకు వాటి విడుదల ముఖ్యగు పని అంతా విద్యార్థులది, మాష్టర్లది. సర్వీ గింజలు పాతి మొక్కలు తయారు చేయటం మరొక పని. ఒక పూటంతా మా కిదే పని. పిల్లలు వేళకు హాజరై ఈ పనులలో పాల్గొనాలి. అలస్యాలు, నాగాలు పనికి రావు. రాట్నాల మీద చేత నైనట్లు ముతక, సన్ననూలు వడకటం, పంటెలకు చుట్టటం, తెగిపోయిన పోట్లు ఒక పద్ధతిని అతుకులు పెట్టటం మొదలగునవన్నీ విద్యలో ఒక ముఖ్య భాగం. కాతేరు గ్రామనివాసి తాతయ్య అనునతడు వస్త్రాలనేతకు ఏర్పాటు చేయబడ్డాడు. అతనిది పూర్వకాలపు గోతిమగ్గం. 'ఇదెట్లాగు అదెట్లాగు తాతయ్యగారూ' అని విద్యార్థులు అడిగితే, 'నేనేం చెప్పేది, చెయ్యండయ్యా, నేత నేర్చుకోండి' అని ఊరకునేవాడు. పల్లెటూరి మనిషి కనుక బోధించటం చేతనయ్యేది కాదు. నూలు వడకటంలో కూడ కొందరు విద్యార్థులు ఆలోచనాపరులై, కదురు పై నూలు పోయటంలో ప్రయోజనకరమైన intelligence చూపించేవారు; బాలబాలికల ఉపాధ్యాయ గణంతో సహా తీయబడిన జాతీయ పాఠశాల ఫొటో ఒకటి ఇప్పటికీ నా వద్ద జాగ్రత్తగా ఉంది. దానిని చూచుకొని ఆనందించటం నాకొక పని! దానిని ఎదుట నుంచుకొన్నప్పుడు ఇందులో నేను వ్రాయని పాత జ్ఞాపకాలెన్నో వచ్చిపడతాయి. అందలి స్వర్గీయ శ్రీ గరికిపాటి సూర్యప్రకాశ రావుగారి బొమ్మ (అంటే ఆయన నిస్స్వార్థ జీవితం) నా కానందం గొలుపుతుంది.

School Working చూడటానికి ఒకనాడు మద్రాసు పెద్ద శ్రీ సి. రాజగోపాలాచారిగారిని తీసుకొనివచ్చారు. స్కూలు స్థాపనకు, దాని నిర్వహణకు ముఖ్యుడు డా॥ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు. ఆయన Herculian Efforts తో 'సీతానగరం' గాంధీ సత్యాగ్రహాశ్రమం దేశవిఖ్యాతి గాంచింది. అక్కడ జరిగినది మరి ఏ కాంగ్రెసు నాయకుడూ చేసి యుండని బ్రహ్మాండమైన పని. గాంధీ యుద్యమ మేటివీరులలో ఆయన ఒకడు. గాంధీ నిర్మాణ కార్యక్రమాని కంతకూ ఆశ్రమాన్ని బృహత్ కేంద్రంగా ఆయన చేశాడు. ముఖ్యంగా రకరకాల ఖాదీ ఉత్పత్తికి ఆయా కుటుంబాల సభ్యులందరి సూత్ర యజ్ఞ దీక్షకూ పేరు తెచ్చినది సీతానగర విశాల సత్యాగ్రహాశ్రమం. ఆ పని దశాబ్దాలుగా జరిగింది. ఆ నాటి సత్యాగ్రహ దిట్టలలో సుబ్రహ్మణ్యం పేరు మొదటిది. బహిరంగ సభలలో ఆయన ఉపన్యసిస్తూ కుడిపాదం కొంచెం పైకెత్తి, తొడకొట్టి గాంధీ ఉద్యమాన్ని గూర్చి పలికిన challenge పలుకులు నాకు బాగా జ్ఞాపకం ఉన్నాయి. పార్టీ స్వాతిశయంతోను, బెదిరింపులతోను గాక, నిర్మాణ కార్య సాధనలో అంత చురుకుగాను సమర్థతతోను పనిచేసిన సత్యాగ్రహ నాయకుడాయన. చుట్టుపట్ల గ్రామస్థులకు ఆయన చెప్పినదే

వేదం. అంత పలుకుబడి ఆయన సంపాదించాడు. 1921, 22 దశాబంలో పల్లెప్రజల ఉత్సాహం ఎంత ఉండేదో చూపటానికి ఈ మాటలు వ్రాయవలసి వ్రాస్తున్నాను. గాంధీకి తటస్థించిన మరణం లాటిదే డాక్టరు సుబ్రహ్మణ్యంగారికీ వచ్చింది. ముస్తఫాలీఖాన్ అనే పోలీసు ఉద్యోగి కొట్టిన లాఠీ దెబ్బల వల్ల ఎముకలు విరిగి కొన్నాళ్ళు రుగ్మతతో కృశించి ఆయన మృతుడైనాడు.

ఒక రాజమండ్రియే కాక ప్రతి తాలూకా పట్టణంలోను ఆ కాలంలో ఒక్కొక్క జాతీయ పాఠశాల నెలకొల్పబడది. తణుకులో ఆ తాలూకాలోని ప్రతి గ్రామ భూస్వామి నుండి విరాళాలు ప్రోగుచేసి 'టౌన్ హాల్' అను పేరుతో ఒక మంచి భవనం కట్టబడ్డది. దానిని జాతీయ పాఠశాలకు ఉపయోగించ వచ్చునా లేదా అని తణుకు పట్టణ పెద్దలలో కొంచెం భేదాభిప్రాయం వచ్చింది. అందుకొక కమిటీ ఏర్పడి విరాళాలిచ్చిన ప్రతి ఒక్క రైతు వద్దకు వెళ్ళి జాతీయ పాఠశాలకే భవనాన్ని వినియోగించాలని తీర్మానింపజేశారు. Town Hall కని ఒక గది మాత్రం కేటాయించి నట్లున్నారు. అసహాయోద్యమంపట్ల అప్పుడు గ్రామ ప్రజల కుండిన ఉత్సాహ మట్టిది.

సర్కారు పాఠశాలల విద్యార్థులు మాత్రమే కాక అధ్యాపకత్వం మాను కొని ఉద్యమంలో చేరిన అధ్యాపకులెందరో ఉండిరి. అట్లాగే డాక్టర్లు, ప్లీడర్లుకూడ ఉద్యమ కార్యకర్తలైనారు. ఇక్కడి చదువు పూర్తయిన తరువాత కొందరు విద్యార్థులు బందరు నేషనల్ కాలేజీలోను, రవీంద్రుని విశ్వభారతిలోను చేరారు. మా విద్యాలయంనుండి ఒకరిద్దరు, అప్పటి కింకను విద్యార్థి దశలో నుండిన శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, విశ్వభారతిలో చేరినవారే. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ప్రథమతః బందరు జాతీయ కళాశాలాధ్యాపకులే. ఇక్కడ ఒక మాట చెప్పుకోనియ్యండి. ఇది ఆత్మశ్లాఘ కోసం కాక అమాయక గర్వంతో చెప్పుకొనేమాట. ఈరోజు 15-4-83 నేను పుట్టిన తిథి. గాంధీ ఏమైనా (ఆయనకు చివరకు నిరాశతో కూడిన మరణం తప్పలేదు), గాంధీ ఉద్యమమేమైనా (ఆయన బ్రతికి ఉండగానే దానిని ఈ స్వరాజ్య సర్కారు ఎంత చిన్నచూపు చూడాలో అంతా చూచింది) ఈ పషెమ్మ (ప్రకాశరాయడు) చేయి, రాట్నంమీద నుండి యిప్పటికీ సడలలేదు. అందుకు గుర్తుగా శ్రీ మండలి కృష్ణారావుగారి 'గాంధీక్షేత్రం'లో ఇటీవల ఒక చిత్రాకారుడు తీసిన చిత్రపటం ఈ రెండో సంపుటం మొదట్లో చేర్చుకొంటున్నారు. చిత్రపటాల వల్ల ఏ పనీ కాదు కానీ శ్రీ కృష్ణారావుగారి కుమారుడు శ్రీ బుద్ధప్రసాద్ నాకిచ్చిన బహుమానమిది. అనుకొనకుండ దాని నిప్పుడు ఈ పుస్తకం కోసం వినియోగించుకొంటున్నాను.

శ్రీ సి. రాజగోపాలాచారి మా పాఠశాలకు వచ్చినట్లు పైన వ్రాసు

కొన్నాను. విద్యార్థుల నుద్దేశించి మాట్లాడుతూ ఆయన పిల్లల నొక ప్రశ్న అడిగాడు, 'Can you tell me who your Head Masrter is ?' అని. 'ప్రకాశరాయడు' అని కొందరు సులువుగా ప్రత్యుత్తర మిచ్చారు. "Oh ! No, My young friends, God alone is your Head Master'' అని ఆయన అనేసరికి, విద్యార్థులందరూ ఆనందంతో కర తాళ ధ్వనులు చేశారు. నాకూ అదొక పాఠమే అయింది.

విద్యాలయాధ్యాపకుడుగా వీలైనంతమంది పెద్ద విద్యార్థులను వెంట నిడుకొని పట్టణ పరిసరాలకు excursion వెళ్ళటం నా అలవాట్లలో ఒకటి. గోదావరి మధ్య నున్న ఇసుక తిన్నెలు, సారంగధర మెట్ట, Reserve Forest, ధవళేశ్వరం వార్షిక తీర్థం వంటివి. ఒకసారి విద్యార్థులతో తీర్థానికి వెళ్ళి తిరిగి వస్తున్నాం. ప్రతిధ్వనింటచేట్లు జాతీయ గీతాలను పాడుకొంటూ వస్తున్నాం. రాజమండ్రి Police Deputy Superintendent తన సిబ్బందితో ధవళేశ్వరం వెడుతూ మాకు ఎదురొస్తున్నాడు - మహమ్మదీయుడు. ప్రజలలో అతడి మారుపేరు 'అగ్గిదొర.' కఠిన స్వభావాన్ని బట్టి అతనికాపేరు సార్థకమయిందను కొంటాను. మమ్మల్ని, మా జాతీయ గీతాలను ఆటకాయించటానికి (పోలీసు వాడుకదా మరి) చేయి పైకెత్తి 'ఆగండి, ఆగండి' అంటున్నాడు. కాని ఆ రోజులలో పోలీసు వాళ్ళ ఆటకాయింపులు ఎవరికి లెక్క ? అతడు చేయి ఊపుతూనే ఉన్నాడు. అతనిని తప్పించుకొని మా దారిని మేము పాటలు పాడుతూ వస్తూనే ఉన్నాం. శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారి 'మా కొద్దీ తెల్ల దొరతనము' పాట తెలుగు దేశం మారుమూలల కంటా మోగిపోతూనే ఉంది. 'జాతీయ గీతాల మహాకవి' ఆయన. గాంధీ ఉద్యమంతోనే, అందుకోసమే ఆయనకు కవిత్వం అబ్బింది. Teachers' Training College లో చదువుతూ ఇక నందుండ లేక, చదువు మాని బైటికి వచ్చేసిన ధీర వీర శిఖామణి ఆయన. ఆ రోజుల్లో ఆయన జాతీయ గీతాలు తెలుగు దేశాన్ని ఊపివేశాయంటే నమ్మండి. ఆ రోజున మాతో ఆయనకూడా ఉన్నారు. మాకెదురు వస్తున్న 'అగ్గిదొర'ను చూచి, అప్పటికప్పుడు ఆశువుగా ఆ పాటకు ఆయన మరో చరణం చేర్చారు. అవసరాన్ని బట్టి అట్లా క్రొత్త చరణాలు చేర్చటం ఆయనకు పరిపాటి. ఒక్కొక్క కొత్తచరణంతో ఆ పాట క్రొత్త ప్రాణం పోసుకొనేది. 'సిగ్గూ లజ్జా లెల్ల బుగ్గిలో కలిపేసి, అగ్గిదొరలై పోవుతారు - మా కొద్ది తెల్ల దొరతనము' అన్నది, ఆ నాటి సమయస్ఫూర్తి. దానితో మా విద్యార్థులలో ఆనందం వెల్లివిరిసింది. కరతాళ ధ్వనులు ఆకాశాన్నంటాయి. అగ్గిదొర, పాపం, ఏంచేస్తాడు ? లాఠీ ప్రయోగిస్తాడా, ఉద్యమమింకా రేగిపోతుంది. ఏమీ చేయలేక తన దారిని తాను పోయినాడు. మరొకసారి శ్రీ గరి

మెళ్ళను నిర్బంధించి, ఏదో జైలుకు తీసుకొని పోతున్నారు. గోదావరి స్టేషనువద్ద రైలు ఆగింది, Platform నిండా మేమందరం నిలబడ్డాము. సత్యనారాయణగారి చేతి సంచిలో హమేషా ఒక ఇత్తడి చెంబు, చేతిలో తాళపు చిప్పలు ఉండేవి. తాళాలు వాయిస్తూ రైలుపెట్టె గుమ్మం వద్ద నిలబడి అప్పటికప్పుడు కల్పించాడో ఏమో 'కూలిపోతున్నాది, కూలీపోతున్నాది - మూలమట్టముగా నీ మూర్ఖ ప్రభుత్వమ్ము' అని ఆయన అనేసరికి Platform అంతా దిక్కులు పిక్కటిల్లేటట్లు చప్పట్లు ప్రతిధ్వనించాయి. అప్పుడప్పుడు హాస్యానికి ఆయన అనేవాడు; 'వాడమ్మ కడుపు బంగారం కాను, చిప్ప చేతికిచ్చాడండీ గాంధీ!' అంటే అడుక్కుని తినమన్నాడని ఒక అర్థం. 'చిప్పంటే మరేం లేదంటూ' తాళపుచిప్పలు చూపించి నోటినిండా నవ్వేసేవాడు. Lord Irwin వైస్రాయిగా నున్నంత కాలం లాఠీ దెబ్బల ముమ్మరం లేదు. అతని తరువాత, అంటే R.T. Conference తరువాత Lord Wellingdon రాకతో, లాఠీ దౌర్జన్యం, కాల్పులు కూడా ఎక్కువయినాయి; స్త్రీ సత్యాగ్రహులపై చెప్పరాని పోలీసు అత్యాచారాలు కూడ బొంబాయి వైపు ఉండేవట.

అంతకు పూర్వమెప్పుడో జిల్లా కోర్టు 'అస్సెసర్ల' లిస్టులో నా పేరు పడి ఉండెను. ఒకానొక ఖూనీకేసులో నన్నొక అస్సెసర్‌గా నియమించి కోర్టుకు హాజరు కమ్మన్నారు. అప్పటికి నేను జాతీయ పాఠశాలకు వచ్చేశాను. జిల్లా జడ్జీ పేర ఒక ఉత్తరం లిఖించి, స్కూలు కుఱ్ఱవాని చేత కోర్టుకు పంపించాను. తప్పకుండా జడ్జీ బల్లమీద పెట్టి వస్తానన్నాడు కుఱ్ఱవాడు. అతని ధైర్యానికి మెచ్చి పంపించాను. ఉత్తరంలో నేను వ్రాసిందేమంటే, 'అయ్యా, జడ్జీగారూ, నేను కోర్టుకు హాజరు కావడానికి మా గాంధీ ఉద్యమం అంగీకరించదు. కోర్టు గుమ్మమెక్కితేను కుక్కతోలు సమం బాబు, దండాలండోయి' అని గరిమెళ్ళ పాటలోని చరణంకూడ వ్రాశాను. 'దయచేసి అస్సెసర్ల జాబితా నుండి నా పేరు తీసివేయండి. లేదా మీ చిత్తప్రకారం చేయవచ్చు. నేను మాత్రం వచ్చి కోర్టులో కూర్చోను' అని ఉత్తరం. 'చింపివేయవచ్చునా దీనిని?' అని బెంచి క్లార్కు అడిగినాడట. "అయ్యో అట్లయితే ఏలాగు? కలెక్టరును సంప్రదించా"లని అన్నాడట జడ్జీ. తరువాత ఏమైందో కాని ఉత్తరం చింపివేశారని విన్నాను. అస్సెసర్ పనికి రానంటే జరిమానాయో, మరేదో జైలుశిక్షో ఉన్నదట. గాంధీ ఉద్యమం ఆ నాడట్లా పని చేసింది. జడ్జీలు కూడ అట్లా మన్నించారు ఆ ఉద్యమాన్ని, కాకుంటే ఆ శిక్ష నాకూ పడియుండే దేయో.

అప్పుడు జాతీయోద్యమ చిన్న పాఠశాలలే కాదు - కాశీలో పెద్ద వాళ్ళకు 'కాశీవిద్యాపీఠం' ఒకటి నేనెరిగినంత వరకు అహమ్మదాబాదులో

వల్లభ్ గురుకుల విశ్వవిద్యాలయ' మొకటి నెలకొల్పబడ్డాయి. రెండవ దానికి వల్లభ్‌భాయి పటేలుదే అధ్యక్ష పీఠం. దాని ముఖద్వారం పక్కన ఒక తెల్లని పెద్దచలువ రాతిఫలకం మీద ఆ విశ్వవిద్యాలయాన్ని గూర్చి, దాని సాపనోద్దేశాన్ని గూర్చి వల్లభ్ భాయి సందేశం చెక్కబడి ఉంది. ఆ విశ్వవిద్యాలయం యొక్క purpose ఏమిటని ఎవరో అతని నడిగారట. 'ఇంతవరకు ఈ యువకులందరు నేర్చిన చదువును మరచిపోవటమే దీని ఆశయ'మని అతడిచ్చిన జవాబట! గాంధీ అమలు జరిపిన బహిష్కరణలు అంత బలంగా పని చేశాయన్న మాట. ఉద్యమంలో చేరిన కొందరు పెద్ద న్యాయవాదులు (కొందరే అనండి) private న్యాయవిచారణాలయాల నెలకొల్పి స్థానికంగా వచ్చే దావాలపై చక్కని తీర్పులుచెప్పి పార్టీల మధ్య ఇష్టపూర్వకమైన సమాధానాలు కుదుర్చేవారు. దక్షిణాఫ్రికాలో ఇద్దరు ఇండియన్ వ్యాపారస్థుల మధ్య గాంధీ కుదిర్చిన అట్టి ఆదర్శప్రాయమైన రాజీ ఒకటి ఆయన స్వీయచరిత్రలోనే ఉంది. బద్ధశత్రువులైన ఇద్దరు బంధువుల మధ్యనుండిన 37 వేల పౌన్ల బాకీ దావాను సులభ సూక్ష్మంగా తీర్చివేశాడు గాంధీ. ఇందు చిక్కుకొన్న పార్టీలు షేక్‌అబ్దుల్లా ఒకడు, హాజీఖాన్ మహమ్మద్ ఒకడు. ఈ రెండు పార్టీల మధ్య పెద్దపెద్ద యూరోపియన్ లాయర్లు పనిచేస్తూ, ఎప్పటికీ తెగని దావా ఇది. డబ్బు ఖర్చయిపోతోంది; శత్రుత్వం పెరిగిపోతోంది. ఇద్దరూ గాంధీ శరణు జొచ్చారు. గాంధీ చెప్పిన తీర్పు, కల్పిత జిత్తులమారితనాన్ని నోరు మూయించింది.

1923 జాతీయ కాంగ్రెసు మహాసభ మహమ్మదాలీ అధ్యక్షతను కాకినాడలో జరిగింది. నేను హాజరైన అఖిలభారత కాంగ్రెసు వార్షిక సభ అదొక్కటే. మహర్షి శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్వర్యం కింద అది జయప్రదంగా నడుపబడ్డది. 1921 లో గాంధీ రాజమండ్రి వచ్చినప్పుడు నిలువబోటు లేక ప్రేక్షకులు గోడలు, మేడలు, చెట్లు ఎక్కి చూచారు. అవి ఉద్యమం కొత్తరోజులు. కాకినాడలో ఆయన 'వారకాంతల' నిధికి కూడ వెళ్ళినట్లు విన్నాను. అప్పుడు దుర్గాబాయమ్మగారు 12, 13 ఏండ్ల బాలికగా ఆ నాటికే మంచి ఉత్సాహంగల కార్యకర్తగా తయారయింది. ఆమె తల్లిగారి నుండి వచ్చిన ఉత్సాహమది.... 1922 లో గాంధీకి ఆరేండ్ల జైలు శిక్ష విధింపబడ్డది. 'ఇదిగో ఆ జైలు తాళంచెవి నా చేతిలో ఉంది. గాంధీని విడుదల చేయిస్తాం' అని 1923 కాకినాడ కాంగ్రెసు అధ్యక్షుడు మహమ్మదాలీ అన్నాడు. (ఇంకా వుంది



గాంధేయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ, 522 123) సౌజన్యంతో ....పుస్తకం వెల : రు. 20-00.

సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన కథ : సివిల్ ఇంజనీరు విశాలకు, డాక్టరు నాగార్జునకు వివాహం నిశ్చయమయింది. కాని, విశాలకు ప్రమాదం సంభవించడంతో వారి వివాహం వాయిదా పడుతుంది. నాగార్జున చెల్లెలు చందనకు ముహూర్తం పెడతారు. ఆ పెళ్లి పందిట్లో లావణ్య, నాగార్జునలో కృష్ణని చూస్తూ స్పృహ కోల్పోయి, అతని కాళ్లకు చుట్టు కుంటుంది. లావణ్య ఒక న్యూరోటిక్ పేషంట్ - ఆమె పట్ల అందరికీ సాను భూతి.... లావణ్య తన పూర్వ గాథ చెబుతోంది.... ఇక చదవండి.

నాగార్జున పరిస్థితిని అర్థం చేసు కొని, "మీరేమీ భయపడవద్దు మేము తగిన బందోబస్తులోనే వచ్చాము. తమ వెనుకనున్న దెవరో ఆ రౌడీలకు తెలియదు, అమ్మా, మాపని అయి పోయింది - మాకు సెలవా" అని డాక్టరు నాగార్జున మహాలక్ష్మికి నమస్కరించగా అందరూ మతులు పోయినట్టు చూడసాగారు.

కారులో తిరిగి వస్తూండగా, గత జీవితం ఆమె కళ్ళముందు నిలిచింది.

## 72

"ఇక ఆడింది చాలు బడికి పోమ్మా!" చెప్పింది కూతురితో ముత్యాలమ్మ. వామన గుంట ఆడు తున్న రాధ ససేమిరా పోనంది. తోటిపిల్లలతో ఆటల్లో పడి చక్కగా హోమ్ వర్క్ చేసుకుని బయలు దేరిన రంగయ్య బడికి పోనంటున్న చెల్లిల్ని చూసి చంకలో పుస్తకాలు అక్కడ పెట్టి, గంగిరేను మండ పుచ్చుకొని చెల్లిల్ని తరుమ సాగాడు. కొంచెం సేపు చదువుకుని .... రెండు రోజుల కొకసారి బడికి పోతేనే మంచి మార్కులు తెచ్చుకునే చెల్లెలు రోజు సక్రమంగా బడికి పోయి చదువుకుంటే ఇంకెన్ని మార్కులు వస్తాయో!

తెలివి గల తన చెల్లిల్ని డాక్టరు చదివించాలి; ఆ వూరిలో డాక్టరే లేదు. తన చెల్లెలు డాక్టరై దిక్కులేని వారికి మందులివ్వాలి.... అని మనసు లో దృఢపరచుకున్నాడు రంగయ్య.

✠ ✠ ✠

తన చివరి కొడుకు అక్కడే డాక్టరు చదవాలనుకున్నాడు కోద డం. ఆ గొప్ప తమకే దక్కాలి

రంగయ్యా చెల్లెలు పోటీకి రావటం తల తీసినట్టుగా వుంది.

రంగయ్యను బెదిరించాడు. బ్రతిమిలాడాడు. ససేమిరా విన్నాడు రంగయ్యా. చెల్లెల్ని మెడికల్ కాలేజిలో చేర్పించాడు. కోదండం కొడుకు చదివే కాలేజీలోనే దొరకటం మరింత విడ్డూరమయింది.

శెలవులకు కృష్ణ వచ్చాడు. ఫైన లియరు యం.బి.బి.యస్ చదువు తున్నాడు.

"కృష్ణా.... నీవు చదివే కాలేజిలోనే రంగయ్యా చెల్లెలు చదువుతోందట"

"నాకు తెలియద"ని, కొడుకు చెప్పిన జవాబు కొంచెం తృప్తి నిచ్చింది.

రాధని బస్సు ఎక్కించేందుకు ఆమె కూడ వచ్చాడు రంగయ్యా. ఒక మైలు నడవాలి. బస్సు కొరకు నిలుచని వున్నారు. ఇంతలో ఒక గుఱ్ఱపు బండి వచ్చింది. బస్సుకూడా వచ్చింది. నెమ్మదిగా వచ్చింది. బస్సు కండెక్టర్ హడావుడిగా దిగి.... ఆ గుఱ్ఱం బండిలో వచ్చినతనకి విష్ చేసి "రండి.... సార్.... రండి" అని అతి మర్యాదతో ఆహ్వానించాడు.

"ఎవరతను....?" అని అడిగింది రాధ.

"మీ కాలేజిలోనే .... చదువు తున్నాడు - కోదండం కొడుకు కృష్ణ...." అని చెప్పాడు రంగయ్యా.

బస్సులో నిలుచున్న రాధను చూశాడు. అడుగు దూరంలోనే వుందామె.

తను లేచి "మీరు కూర్చోండి' అన్నాడు రాధనుద్దేశించి

"పర్వాలేదు" అంది.

అతను కూర్చోక, నిలబడే వుండే సరికి. బావుండదని కూర్చుంది.

అనాటమి క్లాసుకు తన ఫ్రెండ్‌తో మేడ మెట్లు దిగి వస్తోంది. ఎదురుగా కృష్ణ కనిపించి విష్ చేశాడు. తను ప్రతి నమస్కారం చేసింది గాని ఇరువురివీ కలవరపాటు చూపులయాయి.

తరువాత మరో రెండుసార్లు చూపులతో పలకరించుకున్నారు - ఏమీ మాట్లాడుకోలేదు.

సెలవలకి వచ్చినప్పుడు బస్సు దిగిన రాధ, చుట్టూ కలయ చూసింది .... అన్నయ్యా రాలేదు. తన లెటరు అందలేదేమో !

కృష్ణ కోసం బండివచ్చి ఆగివుంది కాని, బండివాడు లేడు. అతను బండి వాని కోసం, ఆమె అన్నయ్యా కోసం ఎదురు చూస్తూ వుండగా సంధ్య చీకట్లు అలుముకో సాగాయి తాగి తూలుతూ బండి వాడు వచ్చాడు.

"ఎక్సుక్యూజిమ్...

"మీ కభ్యంతరం లేకుంటే మా బండిలో వెళ్దాం రండి"

"పర్వాలేదు... నేను నడచి వెళ్ళ గలను"

చీకటి అలుము కుంటోంది..... ఇద్దరిదీ అదే దారి... "కూచోండి మీ ఇంటి దగ్గర దింపుతాము... ప్లీజ్" అన్నాడు కృష్ణ

ఇంటి ముందు బండి ఆగిన శబ్దం విని... రంగయ్య బయటికి వచ్చాడు. ఆ బండిని బండిలోవున్న కృష్ణను చూసి.... తన కళ్ళను తనే నమ్మలేక పోయాడు.

బండి దిగిన రాధ "థాంక్స్" చెప్పింది.

"థ్యాంక్స్ చెప్పవలసింది నేను.... ఎందుకంటారా....మా బండిలో వచ్చి ....నందుకు," అన్నాడు కృష్ణ.

"తను నడిచి వెళ్తానంటే మీ అబ్బాయే బండిలో ఎక్కమన్నారట. పెద్దింటి వారి మాట తీసేయకూడదని ఎక్కింది" అని సంజాయిషీ చెప్పుకో వలసిన వచ్చింది రంగయ్యకు, కోదం డం పనిగట్టుకు పిలిపించినప్పుడు.

కోదండం రంగయ్యను బాధలు పెడుతున్న కొద్దీ, కృష్ణకు రంగయ్య మీద సానుభూతి రాధ పట్ల అభి మానం పెరగనారంభించాయి,

మళ్లీ సెలవుల కొచ్చిన కృష్ణను తండ్రి కోదండం, అన్నగార్లిద్దరూ కేక లేశారు.

"తోటి మనిషికి తోడ్పడటం తప్పుకాదు. వాళ్ళు ఎవరైనా కావచ్చు ఆపదలో ఆదుకోవడం డాక్టరుగా అది నా ధర్మం."

రాధ గోల్డ్‌మెడల్ తెచ్చుకుంది; కృష్ణతో స్నేహం ఆనాటికా నాడు సమీప బాంధవ్యం కావచ్చింది.

"రాధా; నీ కళ్లెప్పుడూ నన్ను కుశ లమా అని అడిగినట్లు వుంటాయి. అది నాకెంతో హాయి నిస్తుంది. అందుకు నిన్ను 'కుశలీ' అని పిలవాలను కుంటున్నాను. నీ కభ్యంతరమా" అన డిగాడు కృష్ణ.

"నాకు లేదుగాని.... మీవాళ్ళకు వుండవచ్చు - అసలు నన్ను పిలిచే హక్కు కూడా వాళ్ళు మీకివ్వరేమో!"

"స్నేహానికి ఒకరి అనుమతి అక్క ర్లేదు. మనసుకు నచ్చిన వాళ్ళతో స్నేహం చేయటం ఎంత నిర్మలమో ఎంత తియ్యనో నిజమైన స్నేహితులకే అర్థం అవుతుంది."

బస్సులో టైము ఎలా జరిగి పోయిందో తెలియదు. తమ వూరు వచ్చేసింది. ఇద్దరూ దిగారు. చేతుల్లో వున్న బాగ్స్ బండిలో వేసి... ఇద్దరూ జాలీగా కబుర్లు చెప్పుకుంటూ నడక మొదలుపెట్టారు. వాళ్ళను చూచి పెద్ద పాలేరు నిలువు గుడ్లు వేశాడు. బస్సులో పక్క పక్కనే కూర్చుని వచ్చి వుంటారు. ఇప్పుడు పక్క పక్కనే నడుస్తున్నారు. ఇంకొద్ది రోజులు పోతే, పక్క పక్కనే పడు కుంటారు. మరి, ఈ విషయం పెద్దయ్యగారికి చెప్పకపోతే ఎలా.... ?"

♣ ♣ ♣

కటిక చీకటిగా వున్న భయం కర కాళ రాత్రి.... లుంగీ, బనీ యన్‌తో, టవల్ పైన వేసుకొని ముఖం కడుక్కు వస్తూ... విన రానిది ఏదో విని స్తంభించి పోయి నట్లు ఆగిపోయాడు కృష్ణ.

"బాగా అంటించామయ్యా ; నాలుగు పక్కలా అంటుకుంది. అందరూ మంచి నిద్రలో వున్నారు."

"పీడ విరగడ అయింది ఈ రోజుతో !.... నా కొడుకుతో సమానంగా చదివిస్తాడా ఆ బికారి ? నా కొడుకుని వలలో వేసుకుంటుందా అది.... ?"

కృష్ణ తన చెవులని నమ్మలేక పోయాడు. ఎటువంటి విషపు మాటలు. కర్తవ్యం అతనిని ముందుకు వురికింప జేసింది.

రంగయ్య ఇంటికి నాలుగు పక్కల మంటలు. నిద్రలోంచి మేల్కొని.... చూసేసరికి ఎర్రటి మంటలు మీద కొస్తున్నవి. సావిట్లో పడుకున్న రంగయ్య, రంగమణి లేచారు – "అందరూ బయటకు వచ్చేయండి" అని అరుస్తూ. అప్పటికే మంటలు అంటుకున్నాయి. తల్లిని చూశాడు. ఒంటి కాలుతో తల్లిని రక్షించుకుని బయటకు వచ్చాడు. "అయ్యా.... రాధ.... రాధ ...లోపలే వుండి పోనాదయ్యా" రంగమణి ఏడుస్తూ చెప్పింది.

చెల్లెలు రాధను రక్షించుకోవాలనే ఆత్రుతతో ముందుకి నడిచాడు.... అప్పటికే ఊరి ప్రజలు లేచి మంటలు ఆర్పేందుకు ప్రయత్నిస్తున్నారు.

చదువుకు పడుకున్న రాధ కంగారుగా మేల్కొంది. ఆమె లేచేటప్పటికి అంతా మంటలు.... మంటలు.... బయటవాళ్ళ అర్తనాదాలు ఆమెకు వినిపించటం లేదు. సజీవ దహనం అయిపోతున్నట్టు దిక్కుతోచక అలాగే వుండి పోయింది, మీదకు వచ్చే మంటల్ని తప్పించుకుంటూ.... అదే సమయానికి వచ్చిన కృష్ణ, ఎందరు వారించినా వినకుండా, ముందుకు దూకాడు. మంటల మధ్యకు వెళ్ళి పోయాడు.... రాధను వెతుక్కుంటూ ... కాలబోతున్న సజీవ శిల్పంలా వుంది.

కృష్ణ ఆమెను చేరుకున్నాడు. రావద్దు.... రావద్దు.... అంటున్న ఆమె హెచ్చరికను లెక్క చేయకుండా ఆమె దగ్గరగా వచ్చాడు. "నన్ను కాపాడలేరు - మీరు వెళ్ళిపోండి" అంటూ భోరున ఏడుస్తున్న రాధను రెండు చేతుల్లోకి తీసుకొని గుండెలకు హత్తుకున్నాడు. ప్రేమతో ఒకరికొకరు గాఢంగా అల్లుకు పోయిన ఆక్షణంలో పై నుంచి ఏదో వారిమీద దభీమని పడటంతో.... ముందుకు రాబోతున్న ఆ ప్రేమ జంట.... లిప్తపాటులో అగ్నికి ఆహుతి అయిపోయింది. ఆ నిర్మల ప్రేమికులు.... .... మానవతకు మారు పేరైన ఆ నిష్కళంక చరితులు, అనురాగ బంధితులు.... అగ్ని పునీతులయారు.

ఒకే మనసై.... ఒకే హృదయమై ఒకే కులమై.... ఒకే అంతస్తులై.... .... ఒకే శరీరంలా హత్తుకుని వున్న ఆ జంటను చూసేందుకు.... గ్రామ గ్రామాల నుండి కోకొల్లలుగా జనం వచ్చారు. గొప్పింటి అబ్బాయి.... పేదింటి అమ్మాయి.... ప్రేమించి అలా బలి అయిపోవటం వంటి ఇతిహాసాలు కొత్త కాకపోయినా, వారి ప్రేమ

చరిత్రని, ఆత్మార్పణ గావించుకుని అమరత్వం పొందిన ఆ జంట గురించి ఎంతగానో చెప్పుకున్నారు. విడదీయ లేని ఆ ప్రేమజంటకు... ఏకచితపై దహనం చేయాలని పంచాయితీ తీర్పు చెప్పారు.

అంతటి శోకంలోనూ.... రంగ య్యకు ఒకవిధంగా విజయం, కోదం డానికి ముఖం చెల్లని ఓటమి.

## 73

ఆ కథను కనులకు కట్టినట్లుగా తెలుసుకున్న నా గా ర్జు న మనసు ద్రవించి, లావణ్య వైపు చూశాడు. ఆ మంటల్లో ఆ ప్రేమ జంట అలా కాలిపోయిందంటేనే ఎంతో జాలిగా వుంది. తనే అను ఫీలింగు గల లావణ్య పరిస్థితి ఎలా వుంటుంది ? - అనుకుని ఆమెను జాలిగా చూశాడు.

శిలా ప్రతిమలా కూర్చుని వున్న ఆమెను - తన వడిలో చేర్చి లాలించా లనే తపన క్షణం కలిగింది.... కాని ఇప్పుడు ఆమె లావణ్య,.... తను నాగా ర్జున. మరి.... ఎలా సాధ్యం ? – అనుకున్నాడు.

✠ ✠ ✠

ఇంటికి చేరుకున్న లావణ్య నాగార్జునలు ... శ్రీ ని వా స రా వు కి ప్రయాణ విశేషాలు చెప్పారు.

పూర్వజన్మ అనుబంధంతో నాగా ర్జున, లావణ్యలు దగ్గరవుతారు కాబోలు అనుకున్నాడు. ఏమైనా కూతురు వెనుకటికంటె చలాకీగా ఉంది - అదే ఆయనకు కావల్సింది.

నాగార్జున ఇంటికి వెళ్ళేందుకు లేచాడు. అతని వెనుకనే వచ్చింది లావణ్య. ఇద్దరూ మేడమెట్లు దిగు తున్నారు. ఏవో మధుర స్మృతులలో తేలియాడుతూ మెట్లమీద కొంచెం స్లిప్ అవబోయింది - పక్కనే వున్న నాగార్జున పొదివి పట్టుకున్నాడు.

ఆమె వక్షస్థలం అతని గుండెలకు మెత్తగా తగిలింది.

అతని నును వెచ్చని వూపిరి ఆమెని గిలిగింతలు పెట్టింది.

ఆ మధురమైన నిశ్శబ్దంలో అతి చేరువగా రెండు తనువులు స్మర్శాను భవ మాధుర్యంతో తన్మయత్వం పొందాయి. ఆ పదిష్వంగం యిరువురి మనసులనీ ఒక విధంగా మరింత సన్నిహిత పరిచింది.

✠ ✠ ✠

ఇంటికి చేరుకున్నాక కూడా లావణ్యమధురస్పర్శ జ్ఞాపకం అతన్ని వీడిపోలేదు. గత జన్మలు.... తను నమ్మలేడు.... మరి.... లావణ్యా....?

విశాలను ప్రేమించాడు. అయితే విధాత ఆమెను దూరం చేసాడు. ఆమె ఎందుకనో దూరంగా వుండా లనే చూస్తోంది. ఎందుకని ? ఎవ రేమి.... చెప్పారు ? అలా చెప్పే వాళ్ళు ఎవరున్నారు ? ఒక వేళ చెప్పినా, తను అలా దూరమై పోవ టం సమంజసమా....? విశాలలో స్వార్థం లేదు ; కాని, తన జీవితం బాగుపడాలనే వాంఛతో ఆమె తనని తాను దూరం చేసుకుంటోంది.

(ఇంకా వుంది

JAGATI Telugu Monthly ... Edited, Printed and Published by NR Chendur at MANASA PRESS, No 2 Kutchery Road, Mylapore, Madras 600 004